శ్రీ ర స్తు

శ్రీమతే రామానుజాయనమః

# ఉషా పరిణయము

అను

# అనిరుద్ధవిలాసము.

(ఐదంకముల నాటకము.)


గ్రంథకర్త

పద్మవ్యూహ నాటకము రచియించిన

శ్రీమాన్ ఆసూరి మరింగంటి వేంకట

నరసింహాచార్యులుగారు.





ప్రకటనకర్త

కురుకూరి సుబ్బారావు

సరస్వతీబుక్‌డిపో, బెజవాడ, కృష్ణాజిల్లా.

కాకినాడ:

కాకినాడముద్రాక్షరశాలయందు

ముద్రితము.

[రైటు రిజష్టర్డు] 1930 వెల 0—12—0

# ఈ నాటకమునందు వచ్చుపాత్రలు.



## పురుషులు.

| | |
|---|---|
| బలరాముడు<br>శ్రీకృష్ణుడు<br>సాత్యకి | ద్వారకా నగరాధిపతులు |

అనిరుద్ధుడు—కథానాయకుడు

శ్రుతకుడు—కైలాసగిరి నిలయుడు

బాణాసురుడు—శోణపురాధీశ్వరుడు

నారదుడు—దేవఋషి

కుంభాండుడు—బాణాసురుని మంత్రి

బలుడు—బాణునికుమారుడు

| | |
|---|---|
| రక్తదంతుడు<br>ప్రలంబుడు | బాణునిభటులు |

| | |
|---|---|
| రామశాస్త్రి<br>దీక్షితులు | బాణాసురుని పురోహితులు |

| | |
|---|---|
| యెల్లిగాడు<br>పుల్లిగాడు<br>మల్లిగాడు | ద్వారకానగరమందలి యాదవులు |

## స్త్రీలు.

మణిమాల—బాణుని భార్య

ఉషాకన్య—కథానాయకి

సుబ్బలక్ష్మి—రామశాస్త్రి భార్య

చిత్రరేఖ—కథానాయకి చెలికత్తె

రుక్మలోచన—అనిరుద్ధుని ప్రథమభార్య

ఇంకను సందర్భానుసారంబుగ కొంతమంది వత్తురు.

# పీఠిక.

చదువరులారా !

ఇదివరలో రాఘవశతక మాదిశతకత్రయమును బద్మవ్యూ మొదలగు కొన్నిగ్రంథములు నాయథాశక్తి వ్రాసియుంటిని. ఇప్పుడీపుస్తకము మదీయమిత్రులు గొంతమంది యీనాటకము వ్రాయనిర్బంధించుటవలన నాకుఁ దోఁచినంతవఱకు లక్షణస్ఖాలిత్యంబులు గల్గకుండ జాగ్రతవహించియే యీగ్రంథము నెఱవేర్చినాఁడ. ఒకవేళ నిందు దప్పిదంబులున్నచో నీరక్షీరన్యాయమునఁ బండితాళి మన్నింప బ్రార్థించుచున్నాఁడ.

ఇట్లు

గ్రంథకర్త.

శ్రీరస్తు.

# నాంది.

శా. శ్రీరాజీవముఖీస్తనస్తబకకా । శ్మీరార్ద్రవక్షస్స్థలుం
డై రాజిల్లెడు వేంకటాచలనివా । సాధీశుని న్బోలి శ్రీ
మీరంగన్ సిరికొండవాసుఁడగు ల । క్ష్మీనారసింహుం డిం
పారన్ యీకృతినేలుగాత మిలలో । నాచంద్రతారార్కమున్.

మ. పరమానందముతోడ నాటకకళా । పాండిత్యమున్ జూడస
త్త్వరులై వేచిన నీసభాసదుల క । త్యంత ప్రమోదంబు ని
ర్భరసౌశీల్య యశోవిశేషములఁ గూ । ర్పన్ జాలి రక్షించు సు
స్థిరసంపద్గిరిధాముఁడై వెలయు ల । క్ష్మీనారసింహుండిలన్.



# ఉషాపరిణయము.

అను

# అనిరుద్ధవిలాసము.

---

## ప్రథమాంకము.

---

బాణాసురుఁడు ప్రవేశము; తపస్సమాధియందు.

బా—శంకరా! పాపభయంకరా! హిమాద్రులమధ్య నివసించి నీయనన్యభక్తిచింతాతత్పరుఁడనై సర్వకాల సర్వావస్థలయందు సకలచరాచరజంతునిర్మాణకుశలతాప్రతిభాభాసమానుఁడవగు నీ చరణకమలంబులనే నమ్మియున్న యీదాసునియందసమాన కృపారసంబు బఱపి నన్నుద్ధరింప సమ్మతింపవుగావా? మహాత్మా! కరుణారస హృదయుఁడవగు నీవీకరణి నన్ను నిరసింపన్యాయమా దేవదేవా! భవద్భక్తుని విడచిన నీకుఁగీర్తి లభించునా తండ్రీ!

మ. అరయన్ బేదకుఁజిక్కు పెన్నిధివలెన్ । ఆసించితిన్నీదు స
త్కరుణాపాత్రిత నట్టిచో నిటుల ని। ర్దాక్షిణ్యముల్ బూని నీ
చరణాబ్జంబులఁ గొల్చువానియెడ లే । శంబైన ప్రేమావిశే
షరసంబుంచక త్రోసిపుచ్చఁదగునా! శంభో! ఉమానాయకా.

వ. భక్తరక్షకుండవను నీబిరుదేమి సేయఁదలంచితివి మహేశా.

సీ. అనురాగంబున మానవుండు కడుపు। ణ్యారణ్యముం గూర్చి నే
ర్పునఁ బెంచక దుదకావనంబు బహుసాం। పుక్ జూపుచున్నప్పుడా
నినినిర్మూలముసేయ నెంచునొకొ తం। డ్రీ ! మమ్మునారీతి నే
జననంబందఁగఁ జేసి ప్రోవకవిడక్ । శక్యంబె నీకిత్తఱిక్.

కటకటా ! ఇంత ఘోర మెందైనఁగలదా ! నిన్నాశ్రయించిన భక్తుని విడచిన నీకింక లోకంబునఁ గీర్తికల్గునా ? నీవే యిట్లుపేక్షించి రక్షింపకున్న నన్ను సంరక్షించుదక్షులెవ్వరు మహేశా ! గరళ కంఠుండను దానికిమారు కఠినశిలాసదృశహృదయుండనియు బిఱుదు పొందనెంచితివా యేమి ?

చం. కొడుకతిదుష్టుఁడై మిగులఁ । గూడనికార్యము లాచరింప నా
బుడుతనియందుఁ గ్రోధమును । బూని దురంతవిపత్పరంపరల్
ఇడునె మహేశ ! నీవటుల । నే నను నీదు కుమారునట్లుగా
నెడఁదఁదలంచి బ్రోవగదె । నిర్జరవందిత పార్వతీపతీ.

శశిధరా ! నీభక్తుని కడసారివిన్నపంబు నాలింపకున్న నీసన్నిధానంబున నే నిన్ను నమ్మికొని మండుచున్న నీయగ్నిహోత్రంబున కాహుతినయ్యెద. మృత్యుంజయా ! దీనపోషకుండవను నీకీర్తి ముట్టి వల్లరులవెల్లించివైవనెంచియుంటివా ? మహాదేవా ? నిన్ను సేవించి యున్న భక్తులెందరో యున్నతపదవు లందుచుండ నే భిన్నతపఃఫలుండనై యుండవలసినదియేనా ? అక్కటక్కటా ! నీవే నాహృదయమును బరీక్షింపదొడంగిన నాకింకేదిదిక్కు. (ఆలోచించి) డెందమా! తొందరఁజెందకు. ఓప్రేమానుబంధమా ! నన్నెడఁబాసిపొమ్ము. పొమ్ము: ఓధైర్యమా ! నాపజ్జకురమ్ము. ఓవైరాగ్యమా ! ఇంకేల ఆలస్యముగావించెదవు. సత్వరంబుగా నన్ను గలసికొమ్ము. ఓ పంచభూతములారా ! మీరీ దీనునియందనుగ్రహముంచుడు. నిఖిల ధర్మాధర్మ విచక్షణానువర్తీ ! సమవర్తీ ! సీ సీ దైత్యస్వామియుం దసమాన

క్రోధమువహించి సత్వరంబుగా స్వర్గప్రాప్తుని గావింపుము. ఛీ! ఛీ! భగవత్కృపారస విహీనమగు నీతనువేల కాల్పనా. జగజ్జేగీయప్రభా పటలతేజుండగు నామహనీయునిసేవ కనర్హమైన నాకీసర్వాంగంబు లేల; (శంకరునిందలచి) గిరీశా! ఇంకను నాయందుదయరాదా? శరణ త్రాణపరాయణా! ని న్నెన్నివిధంబుల స్మరింపుచున్న ననుగ్రహంబు గల్గదా? అబ్బా! నీమానసము మెంతకఠినమైనదోయీ. (ఆలోచన నభినయించి) కానిమ్ము: నే నీచందనతరుసందోహంబు క్షితిఁగావిం చుకొని యిందుఁ బడియైన యాతనాశరీరంబున నీపదాబ్జంబులె త్రిక రణశుద్ధిగా నమ్మి సేవింపఁగోరుదు. మహాత్మా! ఒకవేళ నన్ను ఘోర నారకంబునఁ ద్రోసినను సరియే. నీయందు లగ్నమైన యీనిర్మల మానసంబు అన్యదేవతల నభిలక్షింపఁజాలదు; అభిలషింపఁజాలదు.

ఉ. నీమహిమాకశేషముల । నిస్తులశక్తినెదఁద్ దలంపుచున్
కామితదాయకుండవని । కాంక్షనుగొల్తును నిన్ను సర్వదా
కోమలవర్ణ! నీవిఁకలఁ । గ్రోధముఁబూని యుపేక్ష సేయ నా
సేమమెఱుంగ నెవ్వరిటఁ । జేరుదురింకను పార్వతీపతీ.

చంద్రశేఖరా! భవత్కృపావిహీనుండనగు నే జీవించిననేమి సార్థకము. (అని అగ్నిలోఁబడ నూహించుచుండును. మఱియొక ప్రక్క శంకరుఁడు ప్రవేశించి) తనలో ఆహా! ఏమి యీతనిదృఢ జ్ఞానము. ఏమి యీతనిసాహసము!

గీ. భక్తుఁడన్నను ఈతఁడే । భక్తుఁడిలను
ఇంద్రియ వినిగ్రహుండౌచు । సాంద్రముగను
తపమునొనరించి నాకృపఁ । దనరఁగోర
నీనిఁబోలినవారలీ । పృథ్విఁగలరె.

ఔరా! ఇట్టిభక్తాగ్రేసరుని రక్షింపక యుపేక్షింప నాకి ఘరా

మండలంబునఁ గీర్తి లభింపఁజాలవు. (అని బాణునిదగ్గఱకు వచ్చి) వత్సా! ఆగుమాగుము, (అని చేతులు గట్టిగ పట్టుకొనును.)

బాణు—అయ్యా! మీరలెవ్వరో నాకు దృగ్గోచరంబుగా నన్ను విడువుడువిడువుడు. (అని వదలించుకొనఁ జూచుచుండును.)

శం—నాయనా! బాణాసురా! ఇదేమివిపరీతము; ఇట్టికార్య మాచరింపఁ బనుగుదు హూసింపరా? ఇటు వినుము.

మ. వినుమో దైత్యకులాగ్రగణ్య బహుళో । ర్వీమండలిన్ గల్గు స
జ్జనబృందంబున కేనె రక్షకుఁడనై । సంకల్పమాత్రాన నే
ర్పున రక్షించెదువాఁడ నిన్నటుల స । మ్మోదంబుతోఁ [illegible]గా
వున నీకోర్కె లెఱుంగఁజేయుమిఁక నిం । పుగ్ గూర్తు నే [illegible]త్రకా.

కుమారా! నీతపశ్శక్తికెంతయు మెచ్చితి. నీయభీష్టంబు[illegible] నీడేర్చెద. నన్నొకసారి వీక్షించి నీచక్షువుల కానందబుఁ గూ[illegible]ము.

బాణు—(తేఱిపాఱఁజూచి) పాదములపైఁబడి మ[illegible]శ్వరా! ధన్యుఁడను.

మ. కనులున్నందుకు సార్థకంబిపుడు వే । డ్క [illegible]ముమ్ము సేవింపఁగా
దనరెన్ గాని భవత్కృపారసము నొం । దన్ గోరెదన్నేఁడు ఓ
యనఘా! పాపలతాలవిత్ర! గిరిక । న్యాచిత్త సారంగశో
భన దివ్యాంగ మహేశ! ఈశ! హరదే । వా! నన్ను రక్షింపవే.

శంక—(లేవనెత్తి) అసురకులాలంకార! బాణాసుర! త్వదభీప్సితం బెఱుంగఁజేయుము. సత్వరంబుగా నెఱవేర్చెద.

బాణు—దేవదేవ! నాహృదయాంతరంబునఁ గలకోరికఁ దెల్పెద వినుఁడు.

ఉ. దేవమహానుభావ! విను । తింతు నుమాసతితోడఁగూడి యిం
పావహిలంగ మత్పురి క । వాటమునందున నీవు నిల్వనా

భావమునందు సంతసము । వర్ధిలుచున్నది సాగరోర్మికల్
శివిని నెల్ల వేళలను । డెందమునన్తలపోయు మీశ్వరా.

మనోవాక్కాయ కర్మేంద్రియంబులచే నియ్యది యే మన్మనంబున రంగత్తుంగతరంగంబుల భంగి నుప్పొంగుచున్నయది. ఇయ్యది నెఱవేర్చి నన్ను రక్షింపుము. రక్షింపుము.

శం——ఔరా! నాయుదారగుణమే నాప్రాణసంకటమాచున్నది. ఈతఁడిట్టి విషమపరీక్ష నేలగావింపవలయు. నాభక్తులమని నన్ను గొలచిన రావణభస్మాసురాదులెల్ల నీవిధంబున గోరి యింతంత యనరాని చింతలపాలు గావించిరి. ఈతఁడుమాత్రి మట్టివాడు కాఁజాలఁడా! అబ్బా! లలితపరిమళకుసుమభరితంబై సకల మునిజనానందకరమై యలరు నారజితగిరివదలి నిర్మలజ్ఞానాసక్తికి దూరుఁడనై సంసారక్లేశాతీతసాగరతరంగడోలికా విలాసలాలితులగు నీమర్త్యలోకంబునం దెట్లు నివసింతును. హా! తెలిసి తెలియక త్వరపడు నన్నుఁగని శ్రీమన్నారాయణుండు నీవు ఉబ్బులింగడవని పరిహాసించినదానికి నేఁడు తార్కాణమగుచున్నదే! కానిమ్ము! గతజలసేతుబంధనమొనర్చిన నేమి లాభము. సద్యస్కాలంబునఁ జేయునదేమి. (ఆలోచించి) నేనే యిట్టివానిని చిన్నబుచ్చ నిఁక ముందు నన్ను స్మరించువారెవ్వరుందురు. (ప్రకాశముగ) కుబ్జా! ఇటువినుము. నీసత్క్రియాచరణసేవల కత్యంతసంతోషమందితి. నీయిష్టప్రకారంబున మద్భటానేకపరివారంబునుఁగూడి నీకోటవాకిటఁ గావలి యుండెద. మఱియు సర్వకాల సర్వావస్థలయందు నీసుఖము నాసుఖముగా నీకష్టము నా కష్టముగా భావించి నీయశశ్చంద్రికలు నలుదిక్కులందుఁ బర్వఁజేసెదలెమ్ము.

మ. ఫలపుష్పాంచితభారమైన తరువెబ్భంగిన్ సమోదారతన్
చెలువారన్ గృపనోమితత్ఫలములన్ జేకూర్చునో మానవా
ధిపకత్యంతమునేను నీపురిని విల్లుంబూని రక్షింతు నీ
బలగంబున్ నినుగీర్తి కామునిగసల్పంజేసిధాత్రీస్థలిన్.

ఇందేమాత్రము సందియంబుఁ జెందవలదు. నీవిఁక గృహంబున కేగి సుఖంబుగా వర్తింపుముపొమ్ము.

బాణు:—మహాత్మా! తావకావ్యాజవిలోకన ప్రాప్తుండనగుటం జేసి కడుధన్యుండనైతి. ధన్యంతనైతి. ఇంక నాకుఁ గావలయున దేమున్నది.

శం—నాయనా! నే నటేగివచ్చెద. (అని నిష్క్రమించును.)

బాణు—(తనలో) ఆహా! ఏమినాయదృష్టము? త్రిభువనాధారుండగు నీగరళకంఠుండు నాయెడఁ బ్రసన్నుండుగాగ నా కేకొఱఁ తయుండును?

చ. ఇడుములఁ బాపి నన్నిపు డహీనకృపామతితోడ బ్రోవగా
గడు నెడలోననెంచె నిలగౌరి మనోహరుఁ డాదరించి యి
య్యెడ నను బోలువాఁడు గలడే పదునాల్గుజగంబులందుఁ బే
ర్వడసి సుఖించెదన్ మిగుల బాహుపరాక్రమ శోభితుండనై.

నా కై యెదిరిజూచు మత్పరివారంబును గలసికొని సుఖంబుగా కాలముఁ బుచ్చెదఁగాక. (అని నిష్క్రమించును.)

[శయ్యాగారమున ఉషాకన్య ప్రవేశించి]

(తనలో) ఆహా! ఏమీస్వప్నమహిమ! అజగన్మోహనాకారుఁ డెవ్వఁడోగాని కంతువసంతజయంతనలకూబరాది మహాభాగుల కన్న మిన్నయగుచు దివ్యస్వరూపలావణ్యంబులచే నలరారుచు నవమన్మథ వికారుండగుచు సంపూర్ణ శరచ్చంద్రచంద్రికా సదృశ ముఖారవిందుఁ డగునాయుండగానిసుందరాకృతియే

కదా నన్నింత విరాళిపాలు గావించినది. (స్వప్నపురుషుని
దలఁచి) ఓజగదేకవీరా! భవద్విరహానలంబునకు నన్నొక శల
భంబును గావింపఁబూనియుంటివా మహాభాగా! నీవు నా
స్వప్నంబులోన నొనరించిన నీశృంగారరసవిశేషక్రీడావినో
దంబులెల్ల నాయంతరంగంబున గంగాతరంగములభంగినుప్పొం
గుచుండుట నీవెఱుంగవా? నాహృదయధనాకర్షితంబగు నీ
కృత్యంబుల నెంత మఱతునన్నను మఱపురావుగదా!

మ. కలలోనీవు మదీయహస్తమును వేడ్కం బట్టి క్రీడించిన
ట్టుల నీవాక్యసుధారసంబిడుచు నెల్లో పూలతల్పంబుపై
జెలువారంగనునన్ను జేరినటులన్ చిత్తంబునన్ గాంచి ని
శ్చలచిత్తంబున నిన్నుగోరుననుభాస్వద్రూపరక్షింపవే.

మహాశయా! నీచానాడు సుషుప్తియం దొనరించిన భావచేష్టావిష
యంబులేకదా నన్నిట్టి విపద్భినిముంచి యొకప్పటికేని దరింపజేయ
కున్నది నాథా.

మ. కనులన్ మూసిన మూయకున్న మదియే కార్యంబుగావించుచుం
డిన లేకున్న సఖాళితోఁగలసి రూఢిన్ ముచ్చటాడంగనా
మనమందెప్పుడు నీవు గన్పడుదువో మాన్యాత్మ! నాయందునీ
వనుమానింపక నన్నుఁ జేకొనఁగ భావ్యంబౌను నీకిత్తఱిన్.

గీ. ప్రజ్వలించెడి వహ్నిలోఁబడిన శలభ
మట్టుల దనరునీదు మోహాగ్నియందు
బడి తపించెడునన్ను నీభవ్యకృపను
బఱపి రక్షింపఁజాలవే పురుషసింహ.

హా! కరుణారసహృదయా! నిన్ననవరతము నెఱనమ్మియున్న నన్ని
విధంబునఁ బరీక్షింపఁ జెల్లునా? హా! దైవమా! కష్టపరంపరలకు
జిక్కంజేసి నన్నిక్కరణి గష్టపెట్టెదువా? దీనబాంధవా! ఇంక నాకేది

కర్తవ్యము? హాజగద్రక్షకా! నావలపులకాని సమకూర్పఁజాలవా? (ఆలోచించి) ఏమిది! నలుదిశ లంధకారబంధురంబులగుచున్నవి. పవనుండుకాబోలు. తనప్రతాపమ్మెల్లయుఁ జూపింప నెల్లి వెచ్చని గాడ్పులు వీచుచున్నాఁడో, ఔరా సమీరా! మందమందంబుగావీచు నీపిల్లవాయువు లిప్పట్ల నగ్ని విలసనంబులామెనుగదా! అదిగో! శీతల వాతపోతశోభితంబుగాంచి నే నొకనీరుండనని విఱ్ఱవీగుచుఁ గమ రయంబునవచ్చు నీహిమాంశు నేమని తలంపుదును.

గీ. మినుకుఁటపుఱిక్క చాల్పంట । మిన్నుతోఁట
దృష్టిదోషంబు వారింపఁ । దీర్చినట్టి
మెఱుఁగు సున్నపుకుండ నా । బరఁగుచంద్రు
డుదయమందెను బ్రీతితో । నుదయగిరిని.

(చంద్రు నుద్దేశించి) ఓగీచంద్ర! దుష్టగుణసాంద్ర! నిన్నుఁజూచిన నజ్ఞానులెల్లరు చల్లనికిరణప్రసారంబులు వెదజల్లుచున్నవని యుల్లంబున సంతసించుటఁగాంచి నేనే కీర్తిఁ బొందితినని గర్వంబున నోడ లెఱుంగక అబలను యిట్లు కష్టపెట్టతగునా? మరావారా? ఇంత మదోద్రేకుండవై యుండ ధర్మమగునా?

గీ. చల్లదనమునుకూర్చును । చంద్రుఁడనుచు
జనములాడువాక్యంబు ల । సత్యమాయె
చల్లదనమింతయును లేదు । చంద్ర! నిన్ను
మింటఁగనుగొన్న నామొడ । ల్మంటలొదవె.

ఛీ! ఛీ!! పాపి! నీవు పాపపుణ్యఫలంబు లే మెఱుంగజాలుదువు? గురుపత్నియని మనంబున శంకింపక మినమినలాడుచుఁ బరుపాన్పియుఁ డవై కలసినదోసకారివిగావా? అక్కటా! నీకెట్టిదయారసము? ఏటి సుగుణములు. ఎట్లులనో యీవిరహిణీజనుల కత్యంతశ్రమంబుఁగూర్చు టయే ప్రాధాన్యము. ఛీ దురాత్మా! నిన్నన్న సార్థకము యేమియున్న

(ఇంచుక ఆలోచించి) ఔను; మూర్ఖున కీధరాధర్మవిచక్షణ యేల యుండును.

"గీ. తివిరి యిసుమునఁ దైలంబుఁ దీయవచ్చు
దవిలి మృగతృష్ణలో నీరుఁ ద్రావవచ్చు
దిరిగి కుందేటికొమ్ము సాధింపవచ్చు
జేరి మూర్ఖుల మనసు రంజింపరాదు."

ఛీ. ఛీ. నిన్నుఁ బ్రార్థించిన నేమిలాభము. నాహృదయధనా కర్షితచోరుని సమీపించి యాదివ్యమంగళవిగ్రహుని సమావేశ మవలంబించి నీకంఠకావర మడఁచెదఁగాక. (స్వప్నపురుషునిఁదలఁచి) హా! మత్ప్రాణధనాపహార! సుకుమారశరీర! నీకైనఁ గరుణజనించరాదా! మహాభాగా! నీచరణకిసలయంబుల నిమురుచు నీమృదు మధురవచోవిలాసము శ్రవణానందముగా నాలకింపుచు నీగాఢాలింగనంబులనందుచు నీమదనసామ్రాజ్యమ్మునకు సన్నిధిదేవతను గావింపక యుపేక్షింప న్యాయమా మహాత్మా!

ఉ. స్త్రీలధనంబు సజ్జనులు చెందగనెంతురు ధర్మహాని భూ
పాలవతంస! నీవిపుడు భాగ్యముగన్ ననుజేరి తత్కళా
లాలితబంధముల్ బరపి రాజిలు నాదు మనోధనంబు నీ
లీలహరింపనేలను భళీ! పరులెవ్వరు విన్న నవ్వరా.

కటికవానికైనఁ గనికరంబు జనించుఁగాని నీకేమాత్ర మను గ్రహము లేదే? (ముందుగా నడచి నిస్పృహచే) ఓహో! యేమి నాభాగ్యము. నామనస్మరణావశిష్టంబున నే నేత్రోత్సవంబుఁ గావింపుచు మరల వెనుకకుఁ దప్పుచుంటివా? మనోహరా! యిదేటివిపరీతము? ఒక్కసారి నీగాఢాలింగనోపేతను గావింపరాదా? సుందరాకారా! నీకరస్పర్శకై యెనసఱు జూను నాచిత్తమెఱుంగ సముత్కంఠపుకావా? (అని ముందుకునడచి స్తంభమాలింగనముఁజేసి) అక్కటా! యేమి

నాదిభ్రమ! ఏమి యీయవివేకము! నాహృదయరాజీవార్కుఁడరు దెంచెనని తలంచి యెట్టిబేలనైతిని. ఇది పరులుజూచిన బరిహసింతురు గదా! హా! దైవమా! నాకింకెవ్వరుదిక్కు. (అని శయ్యపైమూర్ఛిల్లును)

[ప్రవేశము—చిత్రరేఖ]

చిత్ర—(తనలో) కటకటా! దినత్రయమునుండి మనసిచ్చి మాటాడక అన్నపానీయంబుల గ్రహింపక సుధాకరుని కిరణసంకులంబునకు వాడుపద్మమట్లు నీ సుందరవదనారవింద మిట్లు కళావిహీనత వహించనేలచెపుమా (ఆలోచించి) నే నీదిశదాఁగియుండి యేమనుకొనునో విని కర్తవ్యమరసెదఁ గాక.

ఉషా—(లేచి) ఉస్సు. అబ్బా! ఓకామదేవతారత్నమా! నీవేల నన్నాశ్రయించెదవు. ఓధైర్యమా! నీవీయబల నలజడిపెట్టదఁగునా? ఓసాహసమా! సత్వరంబుగారమ్ము రమ్ము. నాదరికిఁ జేరుకొమ్ము, అబ్బా! బాధ, బాధ, భరింపఁజాల భరింపఁజాల. నాథా! నాథా! (అని మరల మూర్ఛిల్లును.)

చిత్ర—బాగు, బాగు, ఈమెకేదియో పురుషపిశాచ మావహించి పరిమితిలేని విరహవేదన గల్పించినట్లు తోఁచుచున్నదే! ఈ కాంతాతిలకంబున కిట్టియవస్థను గూర్చి మనంబుఁజూఱఁగొన్న పురుషసింహుఁడెవ్వఁడో యుండునోగదా! నీయన్నులమిన్న యెంతలో యెట్లుమాఱినది!

మ. అరయన్ గండకపోలభాగములపై । హర్షాశ్రువుల్ జారదు
ర్భరతాపజ్వరపీడితాంగియగు చ । బ్బాయంచు శాల్యోదనాం
బరహారావళియందు ప్రేమనిడకే । వర్తిల్లు నీకాంతకే
కరణిన్ మోదముఁ గూర్తునింకబహు సౌఖ్యస్ఫూర్తిగల్గింపుచున్.

ఏన శైత్యోపచారంబు గావించి యీమె మూర్ఛదేలించెదగాక. (ఉపచరించి) సుందరీమణీ! లే లెమ్ము, లెమ్ము; (అని చెయిపట్టిలేపును.)

ఉషా—ఓసీ నీవెంత టక్కులాడివే.

చిత్రి—నిజమన్న నిష్ఠూరమన్నట్లు నీవింతవఱకు బలికినపలుకు లెఱుంగనని కపటమాయలు బన్నుచున్న నీకన్న నమాయికులు, నీకన్న టక్కరాండ్రెవరు.

ఉషా—(తనలో) ఔరా! ఈమె నాయాలోచన సర్వమెఱుంగనోపు. ఇంక దాఁపనేల మఱియునీమె సుకౌశలంగించి కృతమనోరథురాలనయ్యెదఁ గాక. (ప్రకాశము) సుందరీ! నాయవస్థ నీకేమని యెఱిఁగింతును. నేటికి దినత్రయముక్రిందట మనోజ్ఞకుసుమభూషితతల్పంబున శయనింప మారతిరస్కారసుందరాకారుఁడగు నొకపురుషసింహుండు...... (అర్ధోక్తిచే నూఱకుండును.)

చిత్రి—యువతీరత్నమా! సిగ్గేల? అర్ధోక్తిచే నామనంబు వ్యాకులపఱచిన స్థానకమేమున్నది? అనంతర మేమిజరిగెను.

ఉషా—అప్పురుషకేసరిందద్దము నాపక్కఁజేరి చక్కరవిలుకాని వింటికిఁజిక్కి చెక్కిలినొక్కుచుఁ బెక్కుటక్కరి విషయంబు లంగావించి నామక్కువఁ దీర్చకయే అదృశ్యుఁడగుటం జేసి నిక్కముగా నక్కపటభూపాలునిపై మనస్సుచిక్కి సుర్రుక్కునా యుక్కట్టులు లెక్కసేయ ముక్కంటికైన నలవియగునా? నెచ్చెలీ! అదివ్యసుందరు నేమనివర్ణింతును.

సీ. తమ్మిరేకులమీరు । తెక్కుకన్నులవాఁడు
నిద్దంపుచెక్కిళుల్ । నగడువాఁడు
వజ్రపంజరనిభ । వక్షస్థలమువాఁడు
కమనీయకంఠంబు । గలుగువాఁడు
తొగలరాయనిబోలు । నగుమోముగలవాఁడు
సుందరాకారుఁడు । సొబగువాఁడు

వజ్రిచాపమురీతి । వరుసగా భ్రూయుగ్మ
మింపారఁగలవాఁడు । సొంపుతోడ

గీ. మొన్నరాత్రిని కలలోన । గన్నదాది
విరహవేదనగ్రిగ్గియు । బరితపింతు
తరుణి! మరుఁడను సోన్నారి । కరములందుఁ
గ్రాగుచున్నాను గనకశలాకనగుచు.

నాహృదయ సరసీరుహంబున నాసనమోహనాంగుని సర్వాంగ సుందరవిలాసమే యెల్లప్పుడుఁ బాడగట్టుచు నాకని దనితుని విగ్రహంబునకై మన్మనంబు మిగులఁ దొందరఁ జెందుచు నంతములేని మోహసాగరకల్లోల వీచికాసమూహంబున నన్ను ముంచుచున్నయది. ప్రేయసీ! ఈబాధ భరింపఁజాల.

చిత్ర — అమ్మా! విపరీతాపకారణ మిదియేనా? సరి సరి; నీ వెంత వెఱ్ఱిదానవమ్మా!

మ. కలికీ! మాన్యపదానురక్తుఁడతి వేడ్కన్ యోషిదన్యత్రి భూ
ములలో నిరుసుంగోరునట్లి నిపుణుల్ । పూర్వంబునన్ స్వప్నంబులో
కలనీక్షించిన పూరుషుల్ గోనఁగనన్ । భావింప న్యాయంబె కో
మలి నీకోరికలీట్లియేయగును బల్మాయల్ వెనక్ జెప్పినన్.

సుందరీ! స్వప్నావస్థయందుఁ గన్పించిన యాతఁడు నిజముగా లభించునని తలంపుచు శరత్కాలచంద్ర చంద్రికల కైనయు నీ శరీరకాంతిని నశింపఁజేయు చిక్కు కృశింపఁజెల్లునా బాల! సుగుణశీల!

ఉషా — నెచ్చెలీ! యిదేటిమాట?

మ. సరసన్ లోహపుముక్కునుంచ గానునై । స్వాంతంబు తద్రీతి నా
వరలావణ్యవిలాసవంతునిఁ గళా । ప్రౌఢత్వశీలాదులే

ర్పుఁడనన్నా హృదయాబ్జమున్ మిగులఁదర్పంబెక్కి బంధించు సుం
దరుఁడా వానినిఁ గూడకే నిటుల చింతం బాయు దీర్ఘాత్రిలోన్.

కాంతామణీ! ఈచతుర్దశభువనంబులయందాతని సరివచ్చు వీరపురుషుండొకండైనఁ గలఁడా? ఆనవమోహనాంగుని సరసఁ జేరకున్న నాహృత్కోశంబు భిన్నభిన్నంబులై వెడలకుండునా? ఆరాజన్యచూడామణి కర్ధాంగలక్ష్మియై యుండు సుదతీమణిభాగ్యమే భాగ్యము; ఆమెదే సౌఖ్యము.

చిత్రి—రాజకుమారీ! నీపలుకు లెంతయు వింతగానున్నవే!

ఉ. లాదనిమాత్రవిహంగములకు నాసపహించి దరించునీతిలో
పొందినత్రిప్పునా చప్పట భూములనీరుచు గోరుకైవడిన్
సుందరి నీవు పల్కుటకు చోద్యము స్వప్నగతప్రియుండు పైన్
బొందఁదలంపఁగాఁ దగునె పూజ్యులువిన్న హసింపకుందురే.

అబలా! యిట్టిపట్టు వదలిపెట్టి మనసు దిట్టపరచుకొని సుఖింపుము; సుఖింపుము.

ఉషా—చెలీ! వేయేల; అదివ్యపురుషునిఁ జేపట్టక త్రుటికాలమైన జీవింపఁజాల.

చిత్రి—(తనలో) అక్కటకటా! ఏమి యీమెమనోనిశ్చయము. తాబట్టినకుందేటికి మూడేకాళ్లను నటుల స్వప్నమందు వీక్షించినవానినభిలషించి యిట్టి దృఢమనస్కురాలై యున్నది. కానిమ్ము; మచ్చికకొలఁది సహాయమొనరించెద. (ప్రకాశముగా) యుగ్మలీ! నీమనంబున నిల్పినపురుషపుంగవునే స్వీకరింప నెంచియుంటివా?

ఉషా—ముమ్మాటికి. నామహాభాగునిఁ దప్ప నన్యులవరింపఁజాల, వరింపఁజాల.

చిత్రి—సఖీ ! అట్టులయిన నేలిఖించుచిత్రిఫలకంబులందు నీమనో
హరుని నిరూపింపఁగలవా ?

ఉషా—అందులకు సందేహమేమి ?

చిత్రి—నారీరత్నమా ! నీ విందేయుండుము. నే నఱిగివచ్చెదఁగాక.

ఉషా—పొలతీ ! నీ వీగీనురాలియై దనుగ్రిహముంచి నాప్రియునిఁ
జూపించి నన్నానందసాగరమ్మున నోలలాడింపుము.

చిత్రి—చిత్తమట్లు కావించెద.

(అని నిష్క్రమించును.)

ఉషా—ఈనిర్భాగ్యురాలి కామహనీయునిదర్శనభాగ్యమబ్బునా?అబ్బ
కున్న నే నీధరావలయంబునఁ బ్రిదుకఁగలనా? అయ్యో! నా
యాంశ రిక్తయాసయగునా? హా ! దైవమా ! నీవిషమపరీక్ష
నెల్లయు నీమందభాగ్యురాలియందే చూపించ నెంచితివా ?
అక్కటా! యేమిది. మదీయ ప్రియసి యింత యాలసింపఁ గార
ణమేమైయుండును. (ఆలోచించి మునుముకుఁ జూచి) అదిగో !
తలంచినంతమాత్రింబున నాకలంతఁ బాపు నెచ్చెలి వచ్చుచు
న్నయ దింక నామనోవిచార మెల్లయుఁ బాయును గాక.

[ప్రివేశము చిత్రిరేఖ]

చిత్రి—చెలీ ! యిటు చూడుము మీాచిత్రిఫలకంబులను గను జాగరూక
తగా సందర్శింపుము.

మ. అతివా! యీాశంకుడు కోసలేశ్వరుఁడు బా । హాప్రాక్షిసంరంభజృం
భితశూరుండవ నీతలాధిపసుతా । భీష్మాగసిద్ధుండు ని
ర్జితసోముండు కృపాకరుండు ఘనుఁడా । నీక్షుంగరా జీతఁడో
సతి వీనిన్ గనులారఁజూడఁగదవే । శాతోదరీసుందరీ.

(అని పటమునిచ్చును.)

ఏకచక్రపురిని । లోకకంటకుఁడైన
బకదైత్యుఁ గూల్చిన । ప్రౌఢుఁ డితఁడు
వైరి భీకరమయిన । ఘోరయుద్ధములందు
పగతురఁ జెండెను । బలుఁ డితండు
కౌరవేంద్రుఁడు పన్ను । కుత్సితకృత్యములను
ఘనసమానశక్తిచే । గెలుచు నితఁడు

గీ. వేయిగజముల బలియుఁడై । పృథ్వియందు
భీముఁ డనునాఖ్యచేతను । వెలసినాఁడు
భయదకాలునిఁ బోలియుఁ । బ్రబలువాఁడు
వీనిఁ బొగడంగఁ దరమౌనె । మీననేత్రి.

(మఱియొకపటము జూపుచు) ఈదివ్యసుందరునిఁ గన్నులారఁ జూడుము.

సీ. ఖాండవారణ్యంబు । గాల్పించి యగ్నిచే
గాండీవమందిన । ఘనుఁ డితండు
వీరాధివీరుల । ఘోరాస్త్రములచేత
బంధించినటువంటి । బాహుబలుఁడు
ముక్కంటి నెదురించి । మొగ్గరమందున
పాశుపతాస్త్రంబు । బడసినాఁడు
గురునిప్రీతినిఁ దీర్ప । దారమున ద్రుపదుని
గట్టి తెచ్చినయట్టి । దిట్ట యితఁడు

తే. గీ. నాల్గుదిక్కులయందున । నవ్యకీర్తి
భాసిలంగను జేసిన । పార్థుఁ డితని
శౌర్యగాంభీర్యధైర్యాది । సాహసముల
నెన్న శక్యంబుగాదొకో । నన్నుతాంగి.

మఱియు నీ కవలిరువు రతిసుకుమార శరీరులు.

గీ. అన్నలకు దోడుగా నిల । నున్నవారు
మాద్రినందనులు స । మాను లగుచు
నకులసహదేవు లనగను । బ్రకటయశులు
ప్రేమతోడుతఁ జూడుమీ । వీరి నిపుడు.

సుందరీమణీ! యీయేవురు పాండవు లనంబడుదురు. (చిత్రరేఖ పటము ల నిచ్చును.)

ఉషా—(చూచి) మఱియొకటిచేఁ బూని) చిత్రరేఖా! సంపూర్ణహిమాంశునిఁ దిరస్కరించు నీయందగాఁ డెవ్వరో చెప్పుమా.

చిత్ర—కోమలీ! యీసుందరాకారుఁడు ద్వారకానగరసామ్రాజ్యలక్ష్మీకరకమలపరిగ్రహీతుండై అసన్యనిక్రమాద్భుతగదాదండభండనపండితుండై యనుగదాదండసదృశగదాదండ యుద్ధంబున నాటితేటి హలాయుధధారియై యలరు బలరాముం డసనొప్పుచున్నవాఁడు. మఱియు నీఫలకమవలోకింపుము. (కృష్ణునిపటము నిచ్చును.)

ఉషా—(చూచి) ఇతఁ డించుమించుగా నామనోహరుని లావణ్యాదులకుఁ దోడగుచున్నవాఁడు గాని మిక్కిలి వయోవృద్ధునిగా నున్నాఁడు నీతఁ డెవ్వరో యించుక నెఱుంగఁ జేయుము.

చిత్ర—కోమలీ! వీని యుదంత మెఱింగించెద నాలకింపుము.

సీ. గోగోపప్రీతికై । గోవర్ధనం బెత్తి
ప్రజల రక్షించిన । బలుఁడుసుమ్ము
విషవహ్నిచే మహి । వెలసిన కాళింగు
గర్వమడంచిన । ఘనుఁడుసుమ్ము
హాలాహల స్తన్య । మానఁ జేయుగవచ్చు
పూతకిఁజంపిన । నేతసుమ్ము
మగధాధినాథుల । మదమును స్రుక్కించి
భీష్మకాత్మజ గొన్న । వీరుసుమ్ము

తే. గీ. ఇన్ని యేటికి వల్లప్రీ । యింతులందు
రమ్యక్రీడలదేలు నీ । సౌమ్యుఁ డబల
ద్వారకాపురవరరాజ । ధానియందు
వెలసియున్నాఁడు కృష్ణుఁడన్ । బేరుతోడ.

అమ్మా! ఈతనిలీల లత్యద్భుతమత్యద్భుతము. వీని సరసవచనారచనత్వము, వీనికృత్యములు కడుంగడు వర్ణనాతీతములు. మఱియు నీపటముఁ జూడుము.

శా. విద్యుత్కాంతిసమానదేహుఁడగుచున్ । పృథ్వీస్థలం బందుసం
పద్యుక్తైకయశోధనుండనగ నిర్వక్రప్రభన్ దేలుచున్
ఖద్యోతప్రతిభాయుతుం డగుచు వేడ్కన్ ఒప్పుచున్నట్టి యీ
ప్రద్యుమ్నున్ గనులారఁ జూడఁగదవే । రాకేందుబింబాననా.

ఉషా—(పటముఁజూచుచు) కోమలీ! యీమదనవికారస్వరూపసమానుండే మన్మనంబునుఁ జూఱఁగొన్నవాఁడు.

చిత్రి—(తనలో) ఓహో ప్రద్యుమ్నకుమారుఁ డీమెచిత్తమాకర్షించియుండనోపు. (ప్రకాశముగా) దేవీ! కంతువసంతజయంతాదిమహనీయులఁ దృణీకరించు నిమ్మహాభాగుని వీక్షింపుము. (అనిరుద్ధునిపటము నిచ్చును.)

ఉషా—(సంతోషమున—తనలో) ఆహా! ఏమి నా భాగ్యము. నేవరించినపురుషుని వీక్షింపఁగలనా? లేదా? యని నాయంతరంగంబున నంతులేనిచింత నందియుంటినే. ఓనవమోహనాకార! ఓమహాపురుష! నీవదనసందర్శనంబు లభింపఁజేసి నీగాఢాలింగనంబులకు నన్ను జిక్కఁబఱచి నీచరణపరాగమీాతరుణిశిరంబునఁ బడఁజేసి నన్నుద్ధరింపుము. మనోహరా! (అని పటమును ముద్దిడుకొనుచు) కాంతాతిలకమా! ఈయందగాని యుదంతమరయ మన్మనంబు దత్తఱపడుచున్న యది. సత్వరంబుగాఁ దెల్పుము.

చిత్రి—అమ్మా! యీధీరచరిత్రుఁడు

మ. స్ఫురదిందీవరమందహాసకరుణా । స్యుం డౌచు నొప్పారి సం
గరలీలానటనప్రియుక్తమగు ఖ । డ్గవ్రాతమున్ బూని సుం
దరశారీరకశోకలాపుఁ డగుచున్ । దాక్షిణ్యమూర్తిభవిం
పరహీన్ వెల్గెడు కృష్ణపౌత్రికుని దృక్పర్వంబుగాఁ జూడుమా.

మఱియు.

శా. ఈయంభోధిపరీత భూభుజులయం । దెంతైనఁ గన్గొంటివా
ఈయాకర్ణవిశాలలోచన యుగం । బీపూర్ణ బాహాంతరం
బీయాజానుభుజాభిరమ్య విభవం । బీయంగ సౌభాగ్యకం
బీయిందీవరనీలకుంతలరుచుల్ । యేమం చు లెక్కింతునే.

సీ. శౌర్య ధైర్య స్థైర్య । సాహసంబులయందు
హరిహరాదులదోడు । యలరినాఁడు
కాంత శాంతస్వాంత । ధౌరేయుఁడై చాల
రెండవరాముఁడై । యుండువాఁడు
నిఖిల ధర్మాధర్మ । నిజ విచక్షణుఁడౌచు
నలధర్మజుని సాటి । నరయువాఁడు
మన్మథాకారుఁడై । సన్మార్గయుతుఁడౌచు
సత్యవంతుని పోలఁ । జాలినాఁడు

తే. గీ. అలజయంత వసంతుల । నతిశయించు
భూరిలావణ్యరాశియై । సొరుగాంచి
అంగనా జనచిత్తాప । హారియైన
రూపజిత మన్మథుం డని । యూహ్యఁ డితఁడు.

ఉషా—ప్రియసఖీ! నీ చిత్ర నైపుణ్య మెంతయు మెచ్చవచ్చును. చాల శ్రమఁజెందితివి. ఒక్కింతకాలము విశ్రమించి నీశ్రమ నివారించు నుపాయంబరయుము.

చిత్రి—(తనలో) అబ్బా! ఏమి దీనిమాయలు. తన మోహాలతా వల్లరులకు నాధారభూతుఁడితఁడని తెల్పుటకు సిగ్గునొందుచు నిక్కరణిని భావార్థంబుగాఁ దనహృదయాహ్లాదనకరుని నిరూపించుచున్నయది. (ప్రకాశముగా) కోమలీ! మున్ముందు సిగ్గుచెందక మదనవికారచేష్టాలగ్నహృదయవగుచు గుసుమశిరీషశరీరకాంతిపుంజంబును దూలఁగజేయుచు నీ వింతవఱకనుభవించిన యిడుములు నే నెఱుఁగనివియా! అక్కటా! నీ వెంతటక్కులాడివే. నీహృదయరాజీవభాస్కరుని వీక్షించి యుపేక్షా భావంబున నపేక్షచూడక్క లీమహాశయునియందు బలుపుచు నన్ను మాయలలోఁ బడవేయ నెంచితివా?

ఉషా—నెచ్చెలీ! యిందు మాయ యేమున్నది.

చిత్రి—అట్లయిన నీమానధన మపహరించిన వీరాగ్రేసరుఁ డితఁ డేనా?

ఉషా—అయిన నేమిఫలము?

చిత్రి—యుగ్మలీ! నీ వెంతవెఱ్ఱిదానవమ్మా! మచ్ఛక్తి నెఱుఁగవా యేమి? ఈ వీరపురుషుని నిమేషమాత్రంబున నాచాతుర్యమున గొని తెచ్చి నీకు సౌఖ్యానుభవంబు గూర్చెదఁగాక.

చం. రథములకన్న నెప్పరిగు ఱాలసహస్రము కన్న వాడియౌ
యుధములకన్న నేర్పుగ మహోజ్వలశక్తిని యేగినీప్రియుఁ
వృషులయశఃప్రతాపుని శిరీషశరీరునిఁ దోడితెచ్చి నీ
యధరముఁ గ్రోలుచుఁ సుఖము లందగ జేతును సుందరీమణీ!

ఉషా—నారీరత్నమా! భవత్కృపారస మీదీనురాలియందుఁ బ్రసరింపఁజేసి నన్నానందసాగరనిమగ్నను గావింపుము. నీవిఁక పోయిరమ్ము.

చిత్రి—చెలీ ! చిత్తము. అట్లేగావించెద. (అని నిష్క్రమించును)

ఉషా—(తనలో) నేనుగూడా దేవీపూజ గావించనేగెద.

(అని యిరువురు నిష్క్రమింతురు.)

ప్రథమాంకము సమాప్తము.





# ఉషాపరిణయము.

అను

# అనిరుద్ధవిలాసము.



## ద్వితీయాంకము.



[సభామందిరమున బాణాసురుఁడు, కుంభాండుఁడు ప్రవేశింతురు.]

బాణా—వయస్యా! వేదవేదాంగచతుష్షష్టివిద్యాప్రవీణప్రతాప శౌర్యౌదార్యగాంభీర్యచాతుర్య సాహసుండనై అఖండచండ శాసనుండనై దండిసామ్రాజ్యధౌరేయుండనై మదవేదండ తుండబాహుబలుండనై శత్రుతండంబుల గుండెలఁ జెండ రెండవదండధరుండనై శోణపురాధిపుండనై యుండిన నా సాటిభూపాలు రీ ధరామండలంబునఁ గలరా? వేయేల నా కసాధ్యమగు కార్య మీ పృథ్వీవలయంబునఁ గలదా? ఇటు వినుము.

చం. కులగిరులన్ వినోదమునకున్ సుమబంతులరీతి చేతిలో
పలనెగుఱింతునా మఱియు భానునిఁ జంద్రుని పట్టిదుల్తునా
సలుపుదునా ధరాస్థలిని చాపవిధంబుగఁ జుట్టివైచి యు
జ్జ్వలతరసప్తవార్ధులను జాలకలంగగఁ జేతునాయుఁడన్.

మిత్రమా! శంకరవరప్రసాదలబ్ధబాహుబలుండనగు నాకేకార్యము వశముగాకుండును?

సీ. పాతాళగంగను । పైకిఁదెప్పింతునా
భుజశక్తిచేనేను । మోదమునను
మదహస్తి దంతముల్ । కుదురుగా బిగబట్టి
యూఁతునా వ్యాఘ్రాల । లొప్పగాను
క్రూరవ్యాళంబులఁ । గోరలచేఁబూని
పెకలింతునా మేను । ప్రకటముగను
గడగడలాడంగ । పుడమిని బిడికిట
బొడుతునా జనులెల్ల । నడలుచుండ

గీ. వీర! యింకనేమిసేయంగ । నేను నాకు
దోఁచకున్నది యిప్పుడు । దోర్బలాగ్ని
పరిజ్వలింపుచు నున్నది । సహింప నెవరు
జల్లవడఁ జేతుదింకను । జగతియందు.

కుం—మహాప్రభూ! తమరావిధంబుగా సెలవిచ్చుచున్నది లోకవిదితమేకదా!

బాణా—మహేంద్రభోగంబులందు నాకేకొఱఁతయు లేదు. కాని మనస్సునందున నపారపారావారంబు భంగి నొక్క చింత యతిశయిల్లుచున్న దేమని చెప్పుదును.

కుం—దేవా! సకలజనభీకరులై అవిక్రమపరాక్రమశోభితానందస్వరూపులై యత్యనుపమానభుజాభిరామశ్రీయుతులౌ తమకుఁగూడ విచారకారణముండునా?

బాణ—మిత్రమా! నాఖేదమునకుఁ గారణ మెఱిఁగించెద నాలకింపుము.

సీ. ఘనతరాగ్నిజ్వాల । గ్రక్కుచుండెడునాదు
శరములకేనాఁడు । సమయమెట్లు

గంధూతిబాధచే । నిండిన నాబాహు
సందోహమున కెప్డు । విందుగల్గు
వైరిభీకరమహాచు । మీరిన నాదేహ
కాంతు లేనాటికి । వింతగొలుపు
దండపాశిగదా దం।డ సదృశంబైన
మద్గదాళికి నెన్నఁడు । మమతగీదు
తే. గీ. దీరకున్నను చేయున!దేమి యింక
అక్కటా ! నన్ను సంగ్రామ । మందు గడసి
పోరుసల్పెడువార లె । వ్వారలనుచు
మదిని చింతను జెందెద । సదయహృదయ.

సఖా ! నాబాహుసహస్రంబున గండూతి జనించి కదనాపేక్షదీక్ష న
హించియుండ నక్కటక్కటా! నన్ను రణంబున డీకొనుసమర్థుండే లే
డా ! హా యింక నేమిసేయుదును.

కుం—దేవా ! మిమ్ము రణరంగంబున నెదిరించి కదనంబొనర్చునంతటి
సాహసంబు ముక్కంటికైన లేదనియే తలంపవలయును. ఈ
చతుర్దశభువనంబు లెత్తివచ్చినను మిమ్ముజయించువారలీ
ముల్లోకంబులందైన లేరని నిక్కముగా వక్కాణింపగల్గుదును.

బాణు—అమాత్యపుంగవా ! యింక నాకు కర్తవ్య మెఱింగించి
నన్ను కృతార్థునిఁ గావింపుము.

కుం—(ఆలోచననభినయించి) రాజన్యచూడామణీ ! తెల్పెదవినుము.

మ. సరిరారెవ్వరు మిమ్ముమార్కొనగ ర।క్షస్సంఘమందైన గి
న్నరవిద్యాధర దేవతావళుల భూ।నాథప్రకాండంబులో
నరయన్ లేరిల నిక్కమాహరునితో । నత్యద్భుతంబొప్పఁగా
దురమున్ సల్పికృతార్థులై మెలఁగుడం।తో యుక్తమై యొప్పెడున్.

బాణా—మేలు; మేలు; మిత్రమా! నీకుశాగ్రబుద్ధి కెంతయు మె
చ్చఁదగును. గరళకంఠుండే సమర్థుండు. అతఁడే సంతోష
దాయకుఁడు. అమ్మహారణశూరు నెవరొక్కని అస్త్రలంబగు
మొత్తరంబొనర్చి మదీప్సితంబు నీడేర్చుకొందునుగాక.

కుం—దేవర యిష్టమెట్లో అట్లే కావింపుము.

బాణా—ఓరీ ఎవఁడురా ?

రక్తదంతుఁడు—[ప్రవేశము.] తండ్రి! ఏమి సెలవు ?

బాణా—ఓరి సేవకా! శత్రునిర్భిన్నతములైన సకలాస్త్రశస్త్రం
బులఁ గొనిరమ్ము; పొమ్ము.

రక్త—చిత్తము. (అని నిష్క్రమించి- మరలప్రవేశించి.)
రాక్షసేశ్వరా! భవద్బాణజాలంబు లివే స్వీకరింపుఁడు. (బాణము
లిచ్చును.)

బాణా—(బాణములు గైకొని) ఓయి కుంభాండుఁడా! మనమును
గుడము రమ్ము.

కుం—రాజా! మహాప్రసాదము. (అందరు నిష్క్రమింతురు.)

(ద్వారమందు శంకరుఁడు ప్రవేశించి తనలో)

ఆహా! యేమి యీచిత్రము. నిఖిలభూతప్రేత పిశాచశాకినీఢా
కినీపరివారపరివృతుఁడగు నీశంకరుఁడు శత్రుభీకరసంగ్రామ
దోర్వీర్యవంతుఁడగు నీశంకరుఁడు- సకలచరాచర జీవచయ
లయకర్తయగు నీశంకరుఁడు- సర్వజనాహ్లాదకరుఁడగుచు స్వే
చ్ఛానుసార విహారుఁడగుచు నీశంకరుఁ డొక్కసామాన్యనిభం
గి సత్యవాక్పాశబద్ధుఁడగుచు ద్వారరక్షకునివిధంబున నుండవల
సివచ్చెనుగదా. హా! దుర్భరము; దుర్భరము. (ముందుకుజూచి)
**అదిగో మద్భక్తుండేదియో మహాత్కార్యముఁదలపెట్టి నాసన్ని**

ధానంబునకు రానోపు. కానిమ్ము; ఈతని యాలోచన గు ర్తె
ఱింగెదగాక.

బాణా—[ప్రవేశము.] చంద్రశేఖరా! నన్ను భవత్కృపారససాంద్రదృ
ష్టిగా జేసి చింతాసంకుల సాగరంబున ముంపక దఱికిం దీసి ర
క్షింపుము,

శంక—(తనలో) ఈతం డేదియో మరల కృత్రిమవాంఛితంబుఁ గోర
నోపు. (ప్రకాశముగా) వత్సా! నాయం దీదాపరిక మేల?
సత్వరంబుగా జెప్పుము.

బాణా—దేవా! అనధరింపుండు.

శా. వేళాకోళపుమాటగాదు వినుము । ర్వీమండలిన్నెనుదో
ర్లీలాలోలతబంధలబ్ధిగానిహా । శీఘ్ర నిన్ను సంగ్రామమన్
కేళిఁ గోరికొనగోరి నేనిటకు న । క్షీణప్రభన్ వచ్చితిన్
ఆలస్యంబొనరింపఁగా వలదు దే । వా ధ్యక్షరక్షింపవే.

మహాదేవా! సంరంభసంగ్రామవినోదంబును హెచ్చరిక సేయుచుండె
నట్టి క్రీడావలంబనపాండిత్యంబు మీయెడఁ దప్ప తదితరులకు అం
తటి సాహసంబు శూన్యమటంచు నెంచి తావకసన్నిధానంబున
మొఱఁబెట్టుకొనవచ్చితి సోమశేఖర ! నాయందనుగ్రహించి యుద్ధభి
క్ష నొసంగి నన్నుద్ధరింపుమో మహాత్మా!

శంక—నాయనా! బాణాసుర ? యిది యేమి భ్రాంతి, సరిజనులు
విన్న పరిహాసింపరా? నీకు సేవ్యమానుండ నగు నాతోఁ
గయ్యంబున కియ్యకొనిన నీ నిర్మలయశఃప్రకాశలతావల్లరు
లు నశింపవా? ఇంతేకాక.

తే. గీ. తగనుపాగి రెక్క కొండను । దాకినట్లు
నీవు భక్తుండ వౌచును । నెగడియుండి

యురుబలోద్రేకవీరు శం । కరుని నన్ను
మాఱ్కొనంగను జూచుట । మంచిదగునే.

బాణా—శంకరా! మహాదేవా! నీపజ్జ జేరి కరుణాకటాక్షము నొరలిడుచుండ నన్నిక్కరణి నిరసించిన ధర్మమగునా? అయ్యో! నీవేయిట్లు బల్కిన నాభుజాభిరమ్యవిభవం బెట్లుంగునంతతీసమస్త లీధరావలయంబునం గలరా?

తే. గీ. కుటిలమేమియు లేకున్న । గురుప్రతోడ
గుప్పలాడంగ నేనని । పెద్దలెల్ల
పలుకుచుండె వారీతని । తెలియహాక
యురగభూషణ! నాయందు । గరుణనుంచి
దురమొనర్పంగ రాగదే । దోషరహిత.

వేయేల మద్బాహుసహస్రంబు లత్యంతపరిమోదంబున రణంబు సేయ సిద్ధపడుచున్నయవి.

శంక—దైత్యకులసార్వభౌమా! యిదేటిబుద్ధి.

శా. పాపంబంచు నెఱుంగకీవిపుడు గ । ర్వాంధుండవై నే డనిం
గోపాటోపము చేతనన్నుఁ గవయన్ । ఘూర్ణిల్లవాయుష్ఠులున్
చూపుల్ మాయవె ముజ్జగంబులిపుడే । ఋష్యాదులున్ కిన్నరుల్
ప్రాపోన్మీలిత దేవతాచయము మ । ర్త్యశ్రేణి లోగుందరే.

నీభుజబలగర్వాంధకార విధ్వంసభానుండు కొంతకాలంబున కరుదేరఁ గలండు. అంతదాఁక కదనాపేక్షమాని సుఖంబుగా వర్తింపుము; పొమ్ము.

బాణా—పార్వతీవల్లభా! అమ్మహాశయుని జూచుభాగ్యమెప్పుడబ్బును?

శంక—నిరథపతాకం బెన్నాఁడు విఱిగి ధరామండలంబునఁ బడునో అంతవఱకు నిరీక్షింపుచుండుము. అనంతర మాదివ్యపురుషుని

యాశీవిషసదృశాస్త్ర ఘాతంబులచే నీమనంబున కానందము గూర్చుకొందువుగాక.

బాణా—ధన్యోస్మి! ధన్యోస్మి! నేఁబోయివచ్చెద (అని నిష్క్రమించును)

శంక—కటకటా! ఏమి యీమూర్ఖునిహఠ్యదల. తాను ఏఁదినకార్య సాఫల్యముకై యెల్లు తలఁపడి యెదురుచూచుచున్నాఁడో! కానిమ్ము; కానున్నదికాకమానునా? నేను యెంతయనుకొన్న నేమిలాభము.

(శంకరుఁడు నిష్క్రమించును.

(ద్వారకానగరకోపరిభాగంబున చిత్రరేఖ ప్రవేశించి తనలో)

అహా! అత్యంతానందకరమై యఖిలమునిజనాహ్లాద సౌకుమార్య తేజోవిరాజమానమయమై యనన్యసామాన్య విక్రమక్రమ పరాక్రమధీరోదారసద్గుణగణ గరిష్ఠజనోపేతమై యలరుచు నిగోపాలబాలునిపురం బెంతయు వర్ణనాతీతమై యమరావతి యలకాపురుల ధృణీకరించు సుందరంబునఁ గన్పట్టు నీనగరవైభవం బేమని పొగడగల్గుదును.

సీ. గోపురప్రాకార । కుడ్యదీప్తంబొచు
యలరారుచున్నదీ । యంతిపురము
రత్ననిర్మితసౌధ । రాజాంగణముచేత
నలరారుచున్నది । యంతిపురము
కుసుమఫలప్రాత । కుజమహోన్నతినంది
అలరారుచున్నదీ । యంతిపురము.
ఘనపురందరభోగ । కలితాప్తమైయొప్పి
యలరారుచున్నదీ । యంతిపురము

గీ. జూచిధన్యతఁ జెందితి । సొంపుమీర
కనులకబ్బునుదీరెను । కలికికోర్కి

దీర్ఘసుకృతంబు గాంచెద । దీనజనుల
బ్రోచు కీర్తియు । భూతలమున.

ఆహా! నేనెంత యదృష్టవంతురాలను. సకలజనసేవ్యమానుండగు నీ యదువంశసంభవునిపురంబు కనులారఁ జూడఁగంటినే. (ఆలోచనమభినయించి) ఓహో! యిదియేమి వెఱ్ఱి; గోపాలకృష్ణుని నగరవైభవంబు వీక్షింపుచు నేవచ్చిన కార్యంబు నిర్వర్తింపక మందమతిన యిక నేనెట్లు కృతకృత్యురాలనగుదును. (ముందునకునడచి) ఇదియే కాంబోలు అనిరుద్ధుని ప్రాసాదము. ఇందుఁ జేరి సంకల్పసిద్ధి నొందెద గాక. (నిష్క్రమించును.)

(శయ్యాగారమున అనిరుద్ధుఁడు ప్రవేశించి తనలో.)

ఆహా! నేఁడుకడువిచిత్రముగా నున్నదే! యీశయనమందిరము నాయది గానట్లున్నది. మున్నెన్నఁడు తిలకించినచందంబున స్ఫురింపకున్న దక్కటక్కటా! రమ్యమగు చిత్రఫలకనిర్మితమైన నవరత్నస్థాపిత ముకురాంతరాళకమగు నీనిలయము నాయదియేనా! కాదు; కాదు; నామందిరమైనయెడల పార్వణశరచ్చంద్రచంద్రికా విలసనహాసితవదనారవిందయగు నాయనాంగలక్ష్మి యిందుఁగన్పట్టుటలేదే? అక్కా! యేమిది! ఎదిశఁ జూచినను నాహృదయ చకోరలావణ్యంబు గనుపింపక యంతరంగంబున జింతాతరంగంబు లుప్పొంగుచున్నవి కదా.

మ. కలయో నిశ్చయమో మతిభ్రమమొ లే । కన్యాంబసంబద్ధమో
తెలియఁగ జాల మదీయగేహమిది కా । దే యక్కటా! నాదుహృ
జ్జలజాతాన్వయమైన ప్రేయసిలసత్ । సౌందర్యలావణ్యకో
మలియాకారము తోచదేదిశను ర । మ్యక్రీడసంధాయమై.

కటకటా! యిదేమి వైపరీత్యము. ఈగృహాంతరాళంబున కేనెట్లు వచ్చితి. (నల్దిశలుఁ జూచి) హాప్రాణసఖి! నీసరసలావణ్య వాక్సుధ

రీసుధారసోక్తుల వీనులకింపుగా నాలకింపుచు నీగాఢాలింగనంబులం దుచు సకలగుణాభిరాముండగు రమాకుమారు గ్రీడావినోదాబ్ధిని దేల్చుచు దేవేంద్రభోగంబులందుచున్న నన్నీగృహంబునకుం దోడి తెచ్చి యంతులేనిచింత నాకు గూర్చిన యామురాచారపరాయణుల నామదోన్మత్తుల నెంతని నిందింతును.

[మఱియొకపత్రిక ఉషాకన్య పరివేశించి తనలో అనిరుద్ధునిం జూచుచు]

సీ. నేడుగాయానంద । నీరధినిం దేలి
భోగంబులందెదు । పూజగంటి
నేడుగానాకోర్కె । లీడేర్చునటువంటి
నీకోస్వామునిచేత । జేరనుంటి
నేడుగాభద్యోత । నిర్జితదేహుని
సరసనుండగ నెంతో । మురిసియుంటి
నేడుగామనసిజ । క్రీడావినోదముల్
గనుసంతసుకృతంబు । గాంచనుంటి

గీ. భళిరసంకల్పసిద్ధనై । పరమసుఖము
లనుభవించెదు నోముల । నందియుంటి
నరయుననుబోలు ధన్యులీ । యవనిగలరె
జన్మమునంగను నాదెకా । జన్మమిలను.

ఈమహాభాగుండేదియో విచారించుచున్నట్లున్నది. ఈపత్రికకు నిలచి యుదంతమునరసి ముందుజరుగున దాలోచించెదంగాక.

(మూలకునిలచును.(

అని—(తనలో) హా ప్రియసీరత్నమా !

చ. నిముసమునిన్నుబాసి మన । నేస్తనె యీజగమందు మన్మథా
స్త్రముల మహోగ్రదాడికిని । తాళుదునే భవదీయవాగ్ఝరీ

లబలలు. వీరేమి చేయుదురని యింతటి సాహసంబు సేయఁబూను
కొనుట యుచితమేనా? (అని సిగ్గునటింపుచు నిలుచబడి యుం
డును.)

అని—(తనలో) ఓరా! యీ నారీమణిచాతుర్య మేమని లెక్కింతు
ను. భావార్థదాయకముగా నింతకుముందు వక్కాణించిన
పలుకులందెల్ల యర్థము స్ఫురించుచున్నయది. "మజ్జనకుడీ
వార్తవిన్నఁ బ్రబుకనిచ్చునాకుమారా!" అని సంబోధనలందు
నొకటి సజీవునిగా నుండనిచ్చుననియు, "నాకుమారా" యన్న
నాకు మన్మథునివంటివాడవని యీామె యూహకు తాత్పర్య
మగుచున్నయది. సుందరీలలామ నాయం దనురాగస్ఫూర్తిజనిం
చి నన్నిటకు రప్పించిన మహేంద్రజాలన దంబున దోఁచు
చున్నయది. ఓ ధైర్యమా! నీవు నన్ను వదలకుము. ఓమానస
రాజీవమా! విషయాసక్తికొండి యితరాలోచనల పాలు
గాకుము.

చ. స్తనగిరి నూర్ధ్వమెదనరి । చానశరీరవనంబునందు నిం
పునజరియించు మానుసను । భూరిబలాఢ్యుఁడు దొంగవాఁడు నా
వున నిటమీాద నీవటకు । బోయిన దప్పకకీనుగన్గొ నిం
కను ననుమానమేల సుము । బావ్రితమానసపాంథరత్నమా.

ఇట్టి సంకటారణ్యాంబున బ్రవేశించితి వేని;

మ. అనురాగంబను నగ్నిహోత్రమును మా। ద్యద్దోర్ణి చే యింధనా
ళినిగా జేసి శిరీషపుష్ప శరవ। హ్నిజ్వాలానలంబుచే
సినవీనంబగు యజ్ఞవాటికను వేం। చేయు స్మరుండన్న హో
తననూనపరిభ చేతఁ బ్రోల్చునటచే । తః పాంథుడా! పోకుమా.

ఇప్పుడీ సుందరీమణి కేమని ప్రత్యుత్తరం బొసంగుదును. (ప్రకా
శముగా) నన్నీ యంతఃపురప్రవేశ మొనరించిన యీాపుణ్యాస్వ

రూపుల నేనెఱుఁగఁజాల. ఏవాఁడినపల్కులచే నాతినుపుగాఱియలు పఱుచవలదమ్మా-

ఉషా (తొందరచే) అమ్మా! యిదేమిపాపము. నవలావణ్యసంపన్ను లగు యువతీమణులభవనాంతరాళంబున నిర్భయాత్రింబున బ్రవేశించి సకలగుణగణాలంకృతయశోవిశాలురగు తామిట్లు అమ్మాయని పిలువఁజెల్లునా?

అని—(తనలో) ఓహారీ! ఈమె మనస్సు యిప్పటికిఁ జల్లమగుచున్న యదే? కానిమ్ము; (ప్రకాశముగా) సరి. సరి. ఇట్లు అనమ్మా యని పిలచుటయుఁ దప్పిదమేనా? ఏమనిపిలువవలయును?

ఉషా—ఏమనియా? మనోహరియనియు బ్రేయసియనియు బిలచిన బాపములభించునా? మనోహరా! నీసుందరవదనారవింద సందర్శన మహామోదభాగ్యరాశి కెన్నఁడు లభించునాయని యెదురుఁజూచుచు నీదివ్యమంగళవిగ్రహ సమావేశము నా కబ్బునో లేదోయని నిరంతరంబు హరిహరాదులస్మరించుచున్న నన్ను నీయవ్యాజకృపావిలోకన ప్రసారంబుల నాయందుబఱపి నీమృదుమధురవచనరచనత్వంబున ముదంబుగూర్చుచు నీ గాఢాలింగన పరిరంభణం బొసఁగించుచు మదనసామ్రాజ్యధౌరేయునై నన్నేకఛత్రముగా బరిపాలింపుమో మహాత్మా!

మ. విమలప్రేమ సుధీమణీవినుము ఉ । ద్యన్మాదమ సౌందర్య దే
హా మనాయాసముగా నయాచితముగా । హర్షప్రపూతంబుగా
నమితార్థిన్ ఇడఁగాఁదలంచితిని నీ । కైనేఁడు బాగేల నీ
రమణిన్ జేకొనధర్మమౌనుగద ప్రే । మప్రాప్తి నీకర్తకున్.

అని—తరుణీ! యిదేటిమాట. నాటివారలువిన్న నగుబాటుకాదా?

గీ. వీతిహోత్రునిసాక్షిగా । నెలఁదియొకతె
నాదుకరమునుబట్టెను । మోదమలర

నట్టి భార్యను బాసి నేఁ డన్యకాంత
హస్తమే రీతిఁ బట్టుద । నబలమరల.

అబలా! యీలీల శోభిల్లెడి జాలిమాలి నన్నీలీలఁగోరి తెచ్చిన నీహృదయ సంతోషలతాసమూహము నాయుదంత మరసినపిమ్మట నెట్లు భిన్నాభిన్నమై నీవెంత చింతింతువో కదా యనిమనంబునఁ బరితపించుచున్నాఁడను.

ఉషా—ప్రాణేశా! ఇదేమియాగడము. ఇట్టివిపరీత మెందైన నుండునా? నీ సౌకుమార్యలావణ్యముల కచ్చెరువందుచు నీముద్దు ముఖం బవలోకింపక యెదురుచూచుచు, నీకరస్పర్శప్రాప్తిఁ జెంద వేచియున్న యువతీజనుల నవమానించుట ధర్మమగునా మనోహరా?

గీ. ప్రజ్వలించెడు నగ్నిలో । బడినశలభ
మట్లలను నిదియైనమో । హాగ్నియందు
బడితపించెడు నన్ను నీ । పరమునకను
బాపి రక్షింపఁ జాలవే । పురుషసింహా.

నాయకా! క్షేత్రసంబంధి యే రాజన్యకులాలంకారులయందును లగ్నముగాని నాహృదయసుమంబు భవత్కళాపాశబద్ధప్రాప్తి నొందియున్న యీదీనురాలిని రక్షింపను సమర్థుండవు కావా? మహాశయా! నాఁడు స్వప్నమందు నిన్ను గన్నడినదాది త్రికరణశుద్ధిగా, నీచరణసాక్షిగా నిన్నే నమ్మియున్నదానిని విడిచిపుచ్చ భావ్యమగునా నాథా! ఎట్టి శాత్రవుఁడైన శరణుగోర సంరక్షించు క్షత్రియధర్మమే కదా, ధర్మమూర్తీ! యట్టిధర్మంబుల బరిత్యజించి యబలను ఆఁడుదాని నిట్లు బాధించుట శ్రేయస్కరమా. నాసర్వస్వము నీహక్కు గావింపనెంచితిని. నన్ను రక్షింపుము. రక్షింపుము. (అని సమీపించుచు) దేవా!

మిగుల మృదుమధురస్వనం బామూల వినుపించుచున్న యదటు
జూడుము.

ఉ. లేతయిగుళ్లు చక్కఁగ ఘటించిన హస్తఫలాళి మెక్కి సం
ప్రీతినిఁ గోకిలద్వయము । వేడ్కనుమీఱుచు సుస్వరంబులన్
ఈతఱిఁ గూ కుహూయనుచు । నెంతయు పల్కుచునున్న విమ్మొడన్
శీతలమందమారుతము । జెల్వుగ గ్రైను బ్రాంతమోహపీత్రియా.

(అని భుజము నిమురుచు నిలచియుండును.)

అని—(తనలో) అబ్బా! ఏమి దీనిసాహసము. ఏమి యీయాగడ
ము. నామాటల మఱపించుచు తనమనోభీష్టంబుఁ దీర్చుకొన
నెంత వింతమాయలు బన్నుచు నాస్వాంతంబు నాకర్షింపుచు
న్నదే. ఔరా స్త్రీలసాహసమెఱుంగ నాహరిహరామరేంద్రా
దులకైన నలవికాదుగదా. (ఆలోచించి) కటకటా! ఏమిది.
మేదురుధరసమానమగు నాహృదయాంతరాళంబు కలతఁ
బొందుచు, నాధైర్యసాహసంబు లడుగంటుచు నీమగువకరస్ప
ర్శానశిష్టంబున మోహాలత యల్లిబిల్లిగ నల్లుకొనుచున్న
యదేమిచిత్రము!

గీ. అరయఁగోమలియనెడి దివ్యాగ్ని చెంత
పురుషుఁడను నాజ్యఘటమును । యిరవుగాను
నిలిపియుండిన కఱుగక । నిముసమైన
పూర్వమున్నట్టులుండునె । భూతలమున.

అయిన నిట్లు తెలిపిచూచెదగాక. (ప్రకాశముగా)

గీ. మరులు గొననట్టివానిపైఁ । దమకిసీవు
ప్రేమనొంది వరించిన । కీర్తినెంచ
సంధునకు దర్పణంబిడి । నట్లు మఱియు
పుంస్త్వహీనునకేమి యీ । పొసఁగు రంభ.

కోమలీ ! యింకనైన నాభావమెఱింగి నన్ను నాసదనంబునకు జేర్చి నీకు దగినవరునిఁగూడి సుఖింపుము పొమ్ము. (అని ముందుకు నడచును.)

ఉషా—వన్నెకాడా! నీవిటుపల్కినఁ జిన్నతనముగాదా? నలుగురు విన్నఁ బరిహసింపకుందురా? మహాభాగా! నీచరణకిసలయంబుల నొక్కసారి నిమురఁజేయనిమ్ము. (అని పాదములబట్టుకొని) మనోహరా ! విమలకమలకల్హారకైరవనీలోత్పలాది గంధబంధురమగు కాసారంబున మదకరీంద్రంబుప్రవేశించి తత్కోమలసాంద్రనాళీకనాళంబులఁ ద్రుంచువిధంబున నాహృదయలతానికుంజపుంజంబును నీదివ్యరూపలావణ్యాలవిత్రంబు పంచబంగాళంబు భాతిఁగోయుచుండ నీచరణపరాగ మిూతరుణి మఱియుందుబఱపి రక్షింపసమర్థుండవు కావా! మహాశయా!

అని—(తనలో) ఆహా! ఏమి యీ మనోనిశ్చలబుద్ధి. నలదనిపలుమారు దెలిపినను నాసంస్పర్శకై యెట్లు పరితపించుచున్నయదో! (ఆలోచించి) ఇంక నీవిరహతాప మాపఁజాలను. నవరూపవలావణ్యవిలాసవంతురాలగు నీచెలియనుగూడి సరససల్లాపక్రీడావినోదంబులచే మాగుని రూపుమాపెదగాక. (ప్రకాశముగా) భీతహరిణేక్షణా! నీవెంత సాహసురాలవే! నివ్వు వరించినపురుషసింహుని అనుకూలపఱచుకొనిన నీయనుపమానశక్తి నేమని వర్ణింతును. (శిరము నిమురుచు) శాతోదరీ! నీయభీప్సితంబు నెఱవేర్చెదరమ్ము.

ఉషా—హాహా! ధన్యోస్మి. ధన్యోస్మి. నేనిప్పటికిగదా కృతార్థురాలనైతి. మహాశయా!

చ. సరసవచోనిగుంభనల । సారమదెంతయుఁ గర్ణపేయమై
వరలఁగ మన్మథాస్త్రముల । బాధనుఁజిక్కి కృశించునన్నునీ

కరుణాతరాబ్ధిలోఁ మునిచి । కాంక్షను దీర్చి సుఖింపు మీ లతాం
తరమున హాయిగా కుసుమ । తల్పముఁ గూర్చి నిరంతరంబిటన్.

అని—నిజము; నిజ మీయింద్రోపల వేదికాభ్యంతరమున నివసించి
సుఖింతము రమ్ము.

ఉషా—చిత్తము.

(ఇరువురు నిష్క్రమింతురు.)

ద్వితీయాంకము సమాప్తము.





# ఉషాపరిణయము

అను

# అనిరుద్ధవిలాసము.

## తృతీయాంకము.

[శయ్యాగారమున రుక్మలోచన ప్రవేశించి]

రుక్మ—(తనలో) హానాథా! భవద్వియోగదుఃఖాబ్ధినిమగ్నం గాం
జేసి నన్నీవిధంబునఁ గష్టపరంపరలపాలు గావింపఁదగునా
మహాశయా? నీయుత్కృష్టశరీరంబు నేమి సేయఁదలంచితివి.
అయ్యో! యీపరితాపబాధ భరింపఁజాల, భరింపఁజాల.

ఉ. కంటికి ఱెప్పవోలె నను ! గన్గొనుమీరటులాగ్రహించి వా
ల్గంటిని ముద్దరాల నబలన్ విడనాడ సజీవనై ధరన్
ఉంట యసహ్యమౌనుగద ! నోసుకుమారశరీర! నేను నీ
జంటను బాసినే బ్రదుకఁజాలుదునే యికమీఁదటన్ ప్రియా!

అయ్యో! మనవివాహసమయంబున సకలవేదాంతసారమెఱింగిన భూసురులెల్లరు మిగుల ననుకూలదాంపత్యమబ్బునట్లు మంత్రపూతనాశీస్సులొసఁగిరే. అయ్యో అవియెల్లను రిత్తయాయెనే. హా! బాధ ననుభవింపఁజాల ననుభవింపఁజాల. (అనిమూర్ఛిల్లును.)

[ప్రవేశము:—కమల.]

కమల—(తనలో) అక్కటకటా! యీమె దరహసితవదనారవింద మింత వన్నెఁదక్కియుండ గతం బేమి చెపుమా!

గీ. చంద్రకిరణప్రసార సంస్పర్శచేత
వాడుచున్నసుకలికిని । వన్నెతగ్గి
మూర్ఛనొందియున్న నీ । పుష్పగంధి
వగవ కారణమేదియొ । పరగునొక్కొ.

అయిననింతకు త్రైలోక్యసంచారంబునొనర్చు యనంతర మీయమ్మయు
దంతమరసెదగాక. (అట్లుచేసి) (ప్రకాశముగా) అమ్మా రాజపుత్త్రీ !
లెమ్ము; నీపరితాపమేదియో యెఱింగించుము.

రుక్మ—ఉస్సురన్నా ! (అనిలేచి) హాప్రేయసీ ! ఇంక నీజీవచ్ఛవం
బుతో నేమిప్రయోజనమున్నదని పిలుచుచుంటివి.

క—అదేమిటమ్మా ! అట్లనుచుంటివి. నీపరితాపకారణ మరయు నీత
రుణీమణితోఁ బలుకుట యనుచితమగునా యేమి ?

రుక్మ—నారీమణీ ! నాపరితాప మనుచి తెల్పెదను. నాహృదయేశ్వ
రుం డదినంబునందే మరుగునంతరాళంబులం దేమహామార
ణ్యాటవులకేగెనో యేక్రూరాత్ములచేఁ బట్టువడెనో కాని నా
యంతరంగంబునం దంతులేని చింత యుదయించుచున్నది. నీ వెఱుం
గవా యక్కా !

క—ముగ్ధలీ ! బాలారుణోదయ సంకాశంబులు కళాహీనములై
కోమలశరీరంబు కృశింప గతించిన దానికి వగవనేల ?

రుక్మ—నెచ్చెలీ ! వగవక చేయునదేమున్నది.

క—అయ్యో వెఱ్ఱిత్రీ ! నీనాథకీర్తి నెఱుంగ నెంచిన నతండా
సేతుహిమాచల పర్వతప్రాంతారణ్యముల యందుగాని లేక
పదునాల్గులోకంబులం దెచ్చట నున్నను దెచ్చుచంటి నీపిన
తాత పరాక్రమంబు తెలియంగవా ? రారమ్ము. (అని చెయ్యి
పట్టుకొనును.)

రుక్మ—సఖీ ! అట్లుచేయుదము పద. (ఇరువురు నిష్క్రమింతురు)

[ఉద్యానవనమున అనిరుద్ధుఁడు, ఉషాకన్య ప్రవేశింతురు.]

అని—కోమలీ! ఈప్రక్క నించుక వీక్షింపుము.

శా. భూరిప్రీతినిఁగూడు నామధుకరీ । పుంజంబు నల్వంకలన్
జేరన్ బోయి శికీషపద్మరసమున్ । జెన్నారఁగాఁ గ్రోలిఝం
కారధ్వానమొనర్చుచున్ మిగులవే । డ్కల్ గొల్పుచున్నట్టి యీ
దారిన్ యేగిన సంతసబాదవు నే । త్రద్వంద్వ మింపారఁగన్.

కలికీ! విలసితపుష్ప లతాకుంజ మంజరులచే నలరారు నీవనంబెంత రమణీయంబుగానున్నదో చూడుమా.

మ. ఘనసాన్ద్రాది రసాలచూతఘనరం । భాభూరుహాస్ఫీత నూ
తనపుష్పాంకురఖాదులౌ శుకపిక । ధ్వాన ప్రపూతంబుతో
డను వర్తింపఁగ బర్హిబర్హములన । వ్యాప్రాగ్రదీపింప శో
లనమెంతో యొనరించు నాదిశను బాలాచూడు మన్యోన్యతన్.

ఉషా—నాథా! దేవరవారి మృదుమధురవచోనిగుంభనలెంతయు వర్ణనాతీతముగానున్న వాఁడిక్కు నించుక పరీక్షింపుఁడు.
(కేలఁజూపుచు)

ఉ. కమ్మని పుష్పతావులదె । గ్రోలుచునున్నవి నాల్గుదిక్కులన్
ఝుమ్మని భృంగసంతతులు । జొబ్బిలుచున్నవి తద్రసంబు నే
యిమ్ముగ గ్రోలహాయిగను । నీమొదఁ జేరియున్నను వారిసే
త్రిమ్ములకాప్తి గూర్చు సుక । రం బగునీవని నెచ్చనచ్చుగా.

ప్రియా! చిలుకముక్కులచే నక్కాగా నొక్కఁబడి కెంపులీనుచున్న దాడిమీఫలవిరాజితంబై; మదనుఁడు దనపదునుశరంబులకుఁ బదును గూర్చుకదళీతరువులనుండు లేతయాకులును, సాలరసాలతక్కోలల జాజిపున్నాగ కురవక కురంటక పారిభద్రాది భూరుహంబులచేఁ జూచువారిహృదయాకర్షితయంత్రశోభితంబై యీయుద్యానసీమ యెంతయు సంతోషాస్పదమై యలరారుచున్న యదికదా మహా

భాగా! ఆప్రకృతి వసంతసుహృత్తిలకంబు సహాయమొసర్ప నా ప్రకృతిపురుషుం డెంతవిచిత్రముగా నవీనఫలంబుల నిర్మించుచున్నాఁడో చూడుఁడు.

అని—కళ్యాణీ! ప్రకృతిసౌందర్యమే సౌందర్యము. ప్రకృతిచిత్రకారుఁడు తన యపారశక్తినెల్లయు గన్నులపండువుగాఁ జేయుచుండు నటుచూడుమా!

సీ. ఒకవంకఁగోకిల । ప్రకరముల్ మిఱిమిఱర
శృంగారలీలలఁ । జెలఁగుచుండె
ఒకకేళిఁ జిల్కలు । ఒయ్యారమునఁబ్రీతి
విలసిలుపల్కులు । పలుకుచుండె
ఒకప్రక్కవృక్షముల్ । ఒప్పుగాదీర్చియుఁ
బాహుల తాపంబు । బాపుచుండె
ఒకచాయకలహంస । నికరంబులనువొంద
నృత్యవిలాసముల్ । నెఱపుచుండె

తే. గీ. కుసుమభూషిత భూజముల్ । గోమరుమిగుల
సంతసంబును గూర్చున । సంతసమయ
వృక్షవాటికఁజూడుమో । విద్రుమోష్ఠి
దీనివర్ణింపఁదరమౌనె । జీవితలకును.

ఉషా—మనోహరా! ఏసె వసంతామణీయక మూమహేంద్రనలకూబరాది మహనీయుల పుష్పవనంబుల నిష్ఫలంబుగాఁ జేయఁజాలును. మనమీపొన్నగున్నయొద్ద నొక్కింత కాలము విశ్రమింతము రండు.

అని—చెలీ! నిజము; నిజమట్లు చేయుదమురమ్ము. (ఇరువురు ముందుకు నడతురు.)

(తెరలో)

ఉ. ఎవ్వఁడవోరి క్రూర! మది రేక్షణమాంటిగ సంచరించు నీ
పుష్పవనంబుఁ జేరి కడు మూర్ఖుఁడవై కనుమిన్నుఁగానకే
క్రొవ్వున నామపుత్రికను గూడఁగ నెంచెదు దుర్మదాంధ నీ
కెవ్వరు అడ్డువచ్చెదరొ యేనిటఁ జూచెద నేఁడు బాలిశా.

ఉషా—(అనిరుద్ధునిఁ గౌఁగిలించుకొని, భయమున) నాథా! అదిగో; దండతాడితభుజంగంబు భంగి మండిపడుచు గదాదండము గిర గిర ద్రిప్పుచు మత్తవేదండంబు రీతి నఖండ గాఢాహంకారాక్రముం డగు మజ్జనకుండు ఇటే మిమ్ముఁ బట్టుకొనఁగాఁ బోలు వచ్చుచున్నాఁడు. ఈతని పేరు నిన్నమాత్రంబున సకలయక్షరాక్షస దేవాధీశ్వరులకే గర్భనిర్భేదకము గునుగదా! దేవా! ఇంక మనమేయుపాయంబునఁ బ్రాణంబులఁ గాపాడుకొందము. మహేశ్వరా! నాదేహము గడగడలాడుచు నోటమాటరాకనుడి తడబడుచున్నయది. అబ్బా! నాకనులు మిఱుమిట్లుగొల్పుచు కుమ్మరిసారెవలె గిరగిర కాలచక్రము తిరుగుచు నాయంతరంగంబున భయతరంగంబు లుప్పొంగుచున్నయవి. హా! దుర్భరము.

అని—(వీపునచెయి వైచి) భీరురాలా! వలదు; భయపడవలదు. నిఖిలాసురపంక్తిచమూచయార్ణవ వితతిహారోత్క్రమింపన నొప్పు యదుకిశోర సింహుండనై, సంక్రందనాద్యనేక దేవతానికరంబులకు జేయుండనై, క్రూరోరగ దంష్ట్రాగ్నిభీల విషానలకీలికాసమూహంబులనఁ జాలు దివ్యాస్త్రపారీణుండనై యలరు నీయనిరుద్ధకుమారుండు నీయండనుండ భీతిఁ బొందనేల? సామదానభేదదండోపాయంబులం దేయుపాయంబుచేనైన నాతఁడు చిక్కఁబడకుండునా?

ఉషా — ప్రియా! దురాత్ముని కాధర్మరహస్యంబులు తెలిపిన సార్థకమే మున్నది. భుజగర్వాంధుండగు నాతని సంగ్రామరంగంబున జయించు నుపాయంబరసి నన్ను రక్షింపుఁడిదిగో ప్రళయాంతకుని భాతి నిటేవచ్చుచున్నాడు. ప్రాణవల్లభా! నేనతనిఁజేరి సవినయంబునఁ బ్రార్థించిచూచెద. మీరిందేయుండుఁడు.

అని — అబలా! నీవాలీల జరిపిన నతండాగ్రహింపక అనుగ్రహించునా?

ఉషా — పదములపైఁబడి వేఁడుచున్న నాఁడుదానిఁగో డాలకింపక దూఁకునా?

అని — మంచిది. (ఉషాకన్యముందుకునడచును.)

[బాణాసురుఁడు భటులుప్రవేశము. పైపద్యముఁజదువుచు]

ఉ. ఎవ్వఁడవాఁడు క్రూర మది యీక్షణాలోఁటిగ సంచరించునీ

ఉషా — జనకా! రక్షింపుము. రక్షింపుము. (అనికాళ్ళపైఁబడును.)

బాణా — ఛీ! కులటా! పాపీ! పో! పొమ్ము. పొమ్ము. (అనితన్నును.)

ఉషా — తండ్రీ! శైశవంబాదినన్నల్లారుముద్దుగ బెంచి పెద్దగా నొనర్చి నాముద్దుముచ్చటలచే ప్రొద్దులుపుచ్చుకొను చేసినాఁడవు నిగ్రహించి కాలఁదన్న నాగోల నాలకించువారెవ్వరు. నాయనా! మనంబారవరించిన పురుషసింహునియందింత కసికినము లేక శత్రులపాలుగావింప ధర్మమగునా? జనకా! నన్ను గాపాడవా! దేవా! దైత్యకులసార్వభౌమా?

బాణా — ఓసీ! పాంసురాలా! నీవీనాఁడింపు లేరాజవల్లభుని వీనులకు ముల్కులవలెఁ దోఁచుచున్నయవి. ఛీ! ఛీ! కులటా! మదీయవంశార్ణవంబున బడబానలంబు చందంబున జన్మించిన నీముఖంబిఁకఁ జూడఁజాలఁ జూడఁజాల. (అని త్రోసిపుచ్చి- అనిరుద్ధుని సమీక్షించి) ఓరీ! దురాచారపరాయణా! కులవి

హీన! రా; రమ్ము; నీకండలఁ జెండి భూతమ్ముల కాతిథ్యం
బొనర్చెదగాక. (అని పట్టుకొనయత్నించును.)

అని— ఓరీ! రాక్షసాధమా! వృథావాక్ప్రయాసపడు నీనాలుక
వేయిచీలికలు గావించిన నఘంబు లభింపదు. నీవు మద
గర్వాంధుండవై యొడలెఱుంగక మిడిసిపడదొడఁగెదవా?

ఉ. దంచెదఁ బిండిపిండిగను । తథ్యముగన్ నిను ప్రేతచెంతకున్
బంపెద నీదుసైన్యమును । భండనమందునఁ గూల్చి నిన్ను గ్రి
క్కించెద రక్తధారలను । కీర్తినిఁగాంచి యనంతరంబు పో
షించెద నీతనూజనతి । చెల్వఁ జేకొని చూడుము; హీనుఁడా.

బాణా— ఓరీ పోటరీ! భీభత్సంబగు రణప్రదేశంబున మత్క్రూర
శిలీముఖంబుల కెరయగుదువుగాక. రా; రమ్ము;

అని— నా నిశితకరవాలంబున నీశిరము నూడఁదీయుదును. ఇది ము
మ్మాటికి నమ్ముకొనుము. మనమా సముద్రప్రదేశంబున కేగుదము
రమ్ము— (ఇరువురు నిష్క్రమింతురు.)

ఉషా— (తనలో) కటకటా! యింకనా కేదిదిక్కు. నాహృదయే
శ్వరుం డాదానవేశ్వరుని దాడి కెట్లోర్చును. (ముందుకుజూచి)
అదిగో తెళ్ళగుంపునఁ బ్రవేశించుసింగంబుభంగి భగ్గుభగ్గున
మండుచు నాప్రియుండు శత్రుపక్షపాతుల నెట్టిరికట్టుచున్నా
ఁడో- అవురా! ఎంతలో నెంతలాఘవంబున మజ్జనకుండు కో
పంబున శరీరంబు కంపింప గిరగిరదిఱుగుచు నింద్రుని వజ్రా
యుధంబుపోల్కి నొప్పియున్న నాగాస్త్రంబుఁ బ్రయోగించి
నాఁడే! (నలుదిశలు పరికించి) అబ్బా! మోసము; మోసము.
నాప్రాణేశ్వరుం డాక్రూరనాగాస్త్రబద్ధుండగుచు నేదియో
పల్కుచున్నట్లున్నయది యాలకించెద. (వినుటనభినయించును)

చం. సతి పతిఁ బొందఁ గోరి మన । సార వరించిన వానికైన స
న్మతి మిసుమంతలేక బహు । మానహతుండవై కనుమిన్నుఁ గానకే
వెతలనుఁ గూర్పఁగాఁ దగునె । నీరజనాభకిఁక ధర్మహానకిం
గతజలసేతుబంధనము । కైవడి నొప్పదె దానవేశ్వరా.

హా! దైవమా! నేనేమి సేయుదును. నా హృదయవల్లభుని బంధించి రయంబునఁ జనుచున్న నా తండ్రి యవివేకమేమని లెక్కింతును. (ఆలోచించి) నేనిచ్చట నెంతసేపోయిన నేమిలాభమున్నది. సదనం బున కఱిగి యదయుండగు నా జనకుని మనసుఁ ద్రిప్పఁజూచెద.

(ఉషాకన్య నిష్క్రమించును.)

[ద్వారకానగరము సభాంతరమున బలరాముఁడు, కృష్ణుఁడు, సాత్యకి, ప్రద్యుమ్నుఁడు విచారమునఁ బ్రవేశింతురు.]

ప్రద్యు — తండ్రులారా! పుత్రవియోగశోకసాగర కల్లోలకాలాలితుం డనగు నా వీనులకు మీ రనుపల్కు లెంతయుఁ గఠినశూలం బులవలె నాటుచున్నయవి. అహహ కుమారశేఖరుని, ఆనవమోహనాంగుని; నా ముద్దులయ్యను; నా హృదయాహ్లాదకరుని నెడఁబాసి సజీవుండనై యుండుటకన్న మృతినందుటయే సము జసముగా నున్నది.

బల — వత్సా! యిదేమిటోయి. అవీరశిఖామణివై యిట్లు విలపించుట భావ్యముగునా? ఆకుమారసింహుని పేదరాత్ములచే జిక్కి నను నిమేషకాలంబున జయించు భుజబలవిశాలురమగు మే ముండ నీవేల బేలవలె గోలసేయుచు జాలిఁబూలెదవు?

కృష్ణు — తనయా! విచారింపకుము. ఈ త్రిజగంబులం దెందున్నను శత్రు నిర్భిన్నతమాంబులగు నీవీరశరశరాసనంబులచే శాత్రవసమూ హంబును దృటిలోపలఁ జంపి నీకు మాయనప్పగించెదము.

సాత్యకి—సోదరులార ! సరస్వతీవీణారవసన్నిభంబులై శ్రోత్రానం దకరంబుగా నలరు నీ నిస్వనంబేరిదై యుండును ?

బల—(పైకిఁజూచి.) కృష్ణా! దేవమునీంద్రుఁడగు నారదభగవానుం డుకాంబోలు వచ్చుచున్నట్లు తోఁచుచున్నయది.

కృష్ణు—భ్రాతృవత్సలా! అమ్మహనీయుని సందర్శనంబున మనమన స్తాపంబులుపశమించునుగాత. మన మాఋషికుంజరుని సవి నయంబుగా నెదురుకొని వత్తము రండు.

బల—సాత్య:—అట్లు చేయుదము రమ్ము. (అని ముందుకు నడ తురు.)

నారదుఁడు (ప్రవేశించి తనలో) నేనేఁతయు ధన్యుఁడను. ధన్యుఁ డను. నేటికి దినత్రయమునుండి కడుపునింపుకొన శక్తిహీనుం డనై పడరానియిడుమల పాలైతినే.

తే. గీ. కలహాభోక్తనుగన్నని । జలజభవుఁడు
మూఁడుపంక్తులఁ దీర్చియు । ముఖమునందు
నాకు లిఖియించెనదిదాట । నలవికాదు
పోట్లనింపెడుశక్తి నా । కెట్లుదొరకు.

మదగర్వమున నోడలెఱుఁగక మిడిసిపడుచున్న శోణపురాధిపు నకు నియమనంశసంభవులగు బలరామకృష్ణులకుఁ జోరుగలుగు నట్లుచేసి నాయుదరపోషణ గావించుకొందుగాక.(ముందుకునడచును.)

బల & కృష్ణ & సాత్య—దేవమునీంద్రా! మేమొనరించు వందనశ తంబు లందుకొని యీభద్రసింహాసనం బధిష్ఠింపుఁడు.

నార—మంచిది. మీమీయాసనంబుల నలంకరింపుఁడు. (కూర్చుం డును.)

అందరు—చిత్తమట్లగావించెదము (కూర్చుందురు.)

నార—సకలచరాచరసృష్టిస్థితిలయకర్తవగు నీకే యిట్టికార్యమాచరిం
చిన బాలిశునియుదంతంబుఁ దేటబడకుండెనా?

శా. నీమాయాపరికల్పితాఖిలధరా । నీకప్రపంచంబులో
స్వామీ! నీకు నగోచరంబొకటి లేశంబైన గన్పట్టునే
నీమాహాత్మ్యమెఱుంగగావశముతె వాణీనాథయీశానులున్
నీమాయన్ గురుతింపలేరుగద తండ్రీ! దేవకీనందనా.

వాసుదేవా! కానిమ్ము. నీవడిగినప్రశ్నకు సమాధానంబొసంగెద నాల
కింపుము.

తే. గీ. ఉరులఁజిక్కిన పక్షియే । కరణిమదిని
బరితపించుచునుండు నా । పగిదినీదు
పౌత్రకుండట నసురుచేఁ । బట్టువడియు
బద్ధుడై చింతలోఁ । బడెనుకృష్ణ.

సహస్రబాహు గర్వాలంకృతుండగు బాణాసురుని నగరంబున చిత్ర
రేఖావినూత్నమాయాకల్పితబద్ధుఁడైన అనిరుద్ధకుమారుఁ డింతంత
యనరానిపాట్ల ననుభవింప వలసివచ్చెను.

శా. గాలంబందునఁగ్రుచ్చుమీనంబులే
లీలఁ బాధలనొందునో యటుల హాళిన్ నీదపౌత్రుండుసా
బాలారత్నవినోదమోహమున దర్పంబేమియుఁ లేకటఁ
జాలఁ గష్టపరంపరల్ గొనెను కృష్ణాదీన సంరక్షణా.

ప్రద్యు—హా! సుకుమారశరీరా! హా! కుమారా! నీకిట్టి యాపద
సంభవించెనురా తండ్రీ! (అని మూర్ఛిల్లును.)

(అందరు క్రోధమవలంబింతురు,)

బల—(బాణాసురుని తలంచి) ఓరి రాక్షసాధమా! మదకరియూథ
నాథ బాహుబలాభిరాముండగు నీ బలరాముండు నీగుం

పేలఁ జెందుననిన్నైనఁ దలంప కెగ్గాచరించి బ్రతుక యత్నించుచుంటివా! ఛీ! మూర్ఖా!

కృష్ణుఁ—(లేచి యాకసముఁజూచుచు) ఓరోరి! దురాచారా! పిశితాశనా! ఎంతపనిచేసితివిరా?

మ. కడుకోపస్ఫుట దంష్ట్రికములు వే । గన్పట్ట వీక్షించు కై
నడి దావానల కీలికల్ మిగుల గ । ర్వస్ఫూర్తిచేఁ గొంగునన్
ముడివైచెన్ దలపెట్టుకొతి గరళం । బున్ ద్రోలుచండంబుమా
యెడ ద్రోహమ్మొనరించి నీవు బ్రతుకం । గా శక్యమే దుర్మతీ!

ప్రద్యు—(లేచి- కోపమున) ఛీ! ఛీ! ద్రోహీ! అవక్రపరాక్రమవంతులమగు మాతోఁ గయ్యంబునకుఁ దూగిన నీశిరంబు వేయిభిన్నంబులుగా మత్కార్ముకనిశాత ధారాహతున్ జేసి ధరాధరంబులనుఁబోలె నిన్ను ధరావలయంబునఁ బడఁజేసెదఁ గాచుకొమ్ము (నడచుచుండును.)

సాత్య—(ప్రద్యుమ్నునిఁబట్టుకొని,) తనయా! నీవఱుగున దెచ్చటకు?

ప్రద్యు—ఎక్కడికోయని యడుగ నేల? కంఠగర్వితుండగు శాత్రవుని ఖండనమ్మునఁ జెందుటకు.

సాత్య—చిరంజీవీ! ఒక్క నిమీలితకాలమిందు విశ్రమించి పెదనాయన తెల్పునట్లు చరింపక యిట్లుత్వరపడిన సార్థకమేమున్నది.

ప్రద్యు—తండ్రులారా! జగదేకవీరుండగు కుమారసింహు నెడఁ బాసి యొక్క త్రుటికాలమైన జీవింపఁగలనా?

బల—నాయనా! ప్రద్యుమ్నకుమార! నీవేలత్వరపడెదవు. (ప్రకాశముగా) మాధవా!

ఉ. నేనును చిన్నతమ్ముఁడట । నీకు సహాయముగాగ నిల్చి ర
క్షోనివహార్ణవ బుకడు । ఘూర్ణిలునట్లుగ సంగరంబులో

దానవకంఠముల్ దునిమి । తాండవమాడఁగఁ జేతు నేను కృ
ష్ణా ! నలినేక్షణా ! మిగుల । జాగొనరింపఁగ నేల సోదరా ?

మనమింక నాలసింపక శోణపురంబున కఱుగు నుపాయంబునఁ జరింతుము లెమ్ము.

కృష్ణుఁ—అగ్రజా ! అట్లె కావించెద (ప్రకాశముగా.) దారకా ! దారకా! (అనిపిలచును)

దార—యదుకిశోరవరా ! ఏమిసెలవు ?

కృష్ణుఁ—దారకా ! శైబ్య సుగ్రీవ మేఘపుష్ప వలాహకాశ్వనిర్మితాయస్తారథంబును సిద్ధపఱచి యుద్ధప్రకరంబుల నాయత్తపఱచి మనసకలసైన్యంబుల బాణాసురునిపైకి దాడివెడల నాయాజ్ఞగా తెలుపుము- నీవిఁకఁ బొమ్ము.

దార—ఆయుష్మంతుఁడా ! అట్లు కావించెద. (అని నిష్క్రమించును)

కృష్ణుఁ—భ్రాతృవత్సలా ! మనముగూడఁ బ్రయాణోన్ముఖులము అగుదము రండు.

బల—సాత్య- ప్రద్యు—మంచిది.

నార—దేవా ! వాసుదేవా ! ధన్యుఁడను. ధన్యుఁడను. నాకిఁక నను జ్ఞనిమ్ము.

కృష్ణుఁ—తాపసోత్తమా ! చిత్తమట్లె చేయుఁడు.

(అందరు నిష్క్రమింతురు.)

తృతీయాంకము సమాప్తము.





# ఉషాపరిణయము.

అను

# అనిరుద్ధవిలాసము.



## చతుర్థాంకము.



[చెఱసాలయందనిరుద్ధుఁడు ప్రవేశించి తనలో]

హా! ధాతా! అనాథపోషిత! సకలగుణాభిరాముండవైర మాకుమారుండవగు నీకీదురాచారపరాయణత్వము తగునా? అయ్యో! ఇదేమి వైపరీత్యము. పరులసౌఖ్యముఁ జూచి సహింపఁజాలవా! పితామహా! నీవింత కఠినహృదయుఁడవగుటచేతనేకదా నీకింత యైశ్వర్యము. గుడి, గుండము లేనివానికి నీ కాదయారసమెట్లుఁగలుగును? కమలాసనా? నీయనన్యశక్తిసామర్థ్యమెల్ల నెంతనిరర్థకముఁ గావించఁ దొడంగితివి?

మ. నిరుపేదన్ ధనవంతుఁగా ధనికునిన్ । నిర్భాగ్య చందంబుగా
కరుణాళున్ గఠినాత్ముగా కఠినునిన్ । గారుణ్యధౌరేయుఁగా
బరగన్ సృష్టి యొనర్చి మానసమునన్ । బాపంబు పుణ్యంబు గా
నెఱుఁగన్ జాలక నీచకర్ముఁడ వౌ । దేలా ధరామండలిన్.

పరమేష్ఠీ! నీచర్య లతివిచిత్రముగా నున్నవే! హా దైవమా! నాయవస్థ మావారి కెఱింగించువారిఁ కెవ్వరు. హా! ఎంతలో నాకిట్టి కష్టప్రాప్తి కలిగెను.

సీ. మేలైన చేలంబు । మేనఁ దాల్చెడు నేను
మలినవస్త్రము చేత । మెలఁగవలసె.
భర్మనిర్మితమంట । పంబున కేగు నే
చెఱసాలకున్ నేడు । చేరవలసె
కనక పుంఖితమైన । కంకణంబును వీడి
శృంఖలంబునఁ జెయ్యి । చేర్చవలసె.
పంచభక్ష్యాన్నముల్ । భక్షించు నే నిష్ఠు
జొన్నసంకటి చాల । జుఱ్ఱవలసె,

గీ. ఔరవిధి యిట్టు లౌనని । యరయనైతి
కలిత ధర్మార్థముల నైనఁ । దలపనైతి
వనిత నెడబాసి ప్రాణముల్ । మనుపనైతి
లోకరక్షక! నన్నేల । నీకెఖ్యాతి.

కటకటా! నే నేయుపాయంబున నీకారాగారవిముక్తి బొందెదను. మదీయ ప్రేయసితోఁ గూడి యేనాడు సుఖింతును? హా దైవమా! యీపరితాప సముద్రతరంగంబుల నెట్లు తరింతును. తరింపకున్న నే నెట్లు జీవింతును! కట్టా! దుర్భరము. దుర్భరము. (మూర్ఛిల్లును. తెరపడును.)

[శోణపురంబున రాజవీథియందు; రక్తిదంతుఁడు, ప్రలంబుఁడు ప్రవేశింతురు]

ప్రలం— ఓరీ! రక్తిదంతా! మనయూర నేదియో కలకలము విన వచ్చు మిగుల భయంకరార్భాటంబులచే రణభేరి మ్రోగుచున్నయ దేమికారణమో యించుక నెఱుంగఁ జేసి నన్నుఁ గృతార్థునిఁ జేయుము.

రక్త— మిత్రమా! ప్రలంబ! మననగరంబున ప్రభువుగారు నియమించిన పద్ధతి నెఱుంగకుంటివా?

ప్రలం—నాయనా ! అదేదియో నాకించుక నెఱుంగ జేయుము.

రక్త—నేటికి దినత్రియమునుండి జరుగుచున్న వీర విహార మొఱుంగ కుంటివా యేమి ?

ప్రలం—నే నీమధ్య గ్రామమున లేకుంటచే నా కే విషయము తెలియదు.

రక్త—వయస్యా ! మనసార్వభౌమునిద్వేషులగు బలరామకృష్ణులు దండెత్తివచ్చి సంగ్రామంబున డీకొన యత్నించ నాయోధవులయం దప్రతిహతంబగు పరాక్రమంబున శోభిల్లుచు ద్వారక ప్రకుండగు శాంకరీవల్లభుండు వారల నెదుర్కొని సకలభూతంబుల కాహ్లాదంబుగా యుద్ధమొనర్చుచున్నాడు.

ప్రలం—ఆలాగా ! అట్లైన జయం బే విధంబున వర్తించుచున్నయది?

రక్త—ఇంతవర కానీచుల చాటియే యధికముగా నున్నది.

ప్రలం—వత్సా ! రక్తదంతా ! మనమేగి రాజకార్యధురంధరుల మగుదమా ?

రక్త—అందుకు సందేహమేల ? రయంబున జని శత్రుశిరంబులను ధరావలయంబునం బడం జేయుదము. రమ్ము.

ప్రలం—మంచిది ; అట్లే చేయుదము పద.

(ఇరువురు నిష్క్రమింతురు.)

[యుద్ధరంగము—శంకరుండు, కృష్ణుండు బ్రవేశింతురు.]

శంక—యదువంశసంభవా ! కండకావృవ్వన మొండిమాటలాడుచు దండివాండనని మిడిసిపడెదవేల ? అనవసరకలహంబునకుం గాలుద్రవ్వుచు నాతో కయ్యంబున కియ్యకొను నీయవివేక మెంతనికొనియాడుదును.

కృష్ణ—శంకరా ! ఎంతమందబుద్ధివైతివోయి. సకలలోకాధారుండనగు నాతో సంగరాంగణంబున విజృంభించి బవరంబొనర్ప దేవాసురులకైన నలవియగునా ? ఈపిపీలికాశనుండు నామను

మని బాధించుటెఱుఁగవా? ఇట్టిదుండగీని జెండాడక బ్రిదుక నిత్తునా? దుష్టశిక్షణ శిష్టపరిపాలనంబు సజ్జనుల కవశ్యము ధర్మమని నీవెఱుఁగకుంటివా: గరళకంఠా! నీవేకాదు. నిఖిల దేవాసురులాదులగ్గువచ్చినను యీదనుజాధముని రక్షింపఁజాలరు. నీవేల వృథాశ్రమఁ జెందెదవు. జీవంబులతో రజతగిరిం జేరుము.

శంక—శ్రీకృష్ణా! నీ నర్మగర్భితవాగ్విలాసంబునకు భయంపడి పంచఁజేరిన భక్తుని రక్షింపక యుపేక్షింతునా?

కృష్ణుఁ—చంద్రశేఖరా! వలదని పలుమారు దెలిపినను నామాటలు చులకనఁ బఱచి కలహంబునకే తలపడినచో ప్రభాకర కిరణసదృశంబుగా వెలుంగుచు భగ్గుభగ్గుమని మండుచు నగ్నికణంబులఁ గ్రుక్కుచున్ననా చక్రజ్వాలా భీలకీలికల పాలౌదువుసుమీ!

శంక—ఏమేమీ! ఆభీరకులపారావారబడబాగ్నిభారభూత! చెప్పకొనుటకైనలజ్జింపవేల.

సీ. అలజరాసంధుండు । దలఁపడు వేళలో
చక్రమేటికిఁ బోయె । జక్రినీకు
నరకాసురుఁడు మున్ను । దురమును సేయంగ
జక్రమేటికిఁబోయె । జక్రినీకు.
కాలయవనుఁ డుగ్రోర । కయ్యంబు గావింప
జక్రమేటికి బోయెఁ । జక్రినీకు
త్రిపురాసురుని దున్మ । తీవ్రపఱచిననాఁడు
జక్రమేటికిఁ బోయె । జక్రినీకు

తే. గీ. నాడులేనట్టిచక్రమీ । నాడునెట్లు
కల్గెనో నీకుదెల్పుమీ । కఠిన హృదయ

కృతిమము లేక యెవ్వని । గూల్చినావో
వేలు జూపించి చెప్పుమో । బాలకృష్ణ.

యమునందనా ! నీపరీక్షా విశేషంబులఁ గట్టకట్టి వచ్చినదారిం బట్టుము. లేదేని నాపాశుపతాస్త్రంబున కెరయగుదువుగాక (అని పాశుపతాస్త్రముఁ దాల్చును.)

కృష్ణుఁ—మహేశ్వరా ! భవద్విక్రమాటోపమే నెఱుంగనిదియా.

సీ. భస్మాసురుఁడు నిన్ను । భస్మంబుగాఁ జేయ
దలఁచిన నాఁడునీ । తెలివిగంటి
రావణు దాడిచే । రక్షింపనను జేరి
మొఱపెట్టుకొనుటనే । నెఱిఁగియుంటి
అర్ధనారీశ్వరుం । డనుచు లోకులుపల్క
వీనుల కింపుగా । వినుచునుంటి
శరభరూపంబున । నరకేసరిం జాసి
నీవుచెందిన పాటు । నెఱిఁగికొంటి

తే. గీ. ననుచు మాటలనన్నిట । నాఁడె జొచ్చి
నావటరసిగ్గు లేక పినాకహస్త
చాలుఁ జాలింకఁ దెలిసెనీ । శౌర్యమెల్ల
రజతగిరిచేరి బ్రదుకుమో । రాజమౌళి.

ఓయీ ! వృథావాక్ప్రయాసంబున నేమిలాభము ? రణకృపణ చాతురీ ప్రభావ సంపన్నుండ వౌదువేని నారంగస్థలంబున యుద్ధమొనర్చి బలాబలంబుల గుర్తింతము రమ్ము.

శంక—కృష్ణా ! నీవనగొల్లయువతులచెంత వినోదంబులగు మాటలచేఁ బోటుతనముఁ జూపుచుండనుగాను. రా, రమ్ము.

(ఇరువురు నిష్క్రమింతురు.)

[యుద్ధరంగమం దొక ప్రక్క-రక్తదంతుఁడు. ప్రలంబుఁడు ప్రవే
శించి-అపవారితముగా-]

ప్రలంబుఁడు—రక్తదంతా! ఈక్రేవ సింహంబులు సింహంబులు గజంబులు గజంబులు డీకొనుచందంబున భుజాస్ఫోటనంబుఁ గావించుచు మిగుల భయంకరంబుగా నొప్పుచుఁ గన్నులకు మిఱుమిట్లుఁగొల్పుచుఁ దమ శరసంధాననారీవినాదంబునలుదిక్కులుబిక్కటిలఁ జేసి మాంసశకలంబులకై శార్దూలంబులు మార్కొనుభాతిఁ ప్రకాశించునీవీరపురుషులచాతుర్యముఁ జూడుము.

రక్త—స్నేహితుఁడా! వారిరువురు త్రింశత్కోటి దేవతలనైనఁ గెల్చు పరాక్రమశోభితులై యలరారుచుందురు. అదిగో అటుఁజూడుము. ఆగోపాలకుఁడు దేవదేవు నెదుర్కొని నలుదిశ లంధకారబంధురమగునట్లుఁ జేసి తనపదఘట్టనంబునఁ బ్రసరించిన ధరాపరాగంబు మబ్బుగాఁ దోఁచఁ దన్మధ్యంబున మెఱుపుఁదీగకరణి వెలుంగుచు సకలభూతనివహంబులు భీతిలునట్లుగాఁ బాంచజన్యధ్వానంబుఁ బఱఁగింపుచు నెంతవిచిత్రంబుగా తన శరలాఘవంబు జూపుచున్నాఁడో!

ప్రలం—(సంతోషమున) మేలుమేలు. మిత్రమా! అటువీక్షింపుము శమీలతాకుట్మంబున సహస్రకిరణ మార్తాండసదృశాగ్నిహోత్రునిచందంబునఁ దన ఫాలనేత్రాగ్నింబరపుచు గొల్లవానిఁదాకు గరళకంఠునిశౌర్యం బవార్యముగదా!

రక్త—ఆహా! ఏమి వీరప్రతాపము. శత్రునిర్భిన్న దివ్యాస్త్రంబులఁ బూని తమతమవిజయంబులకై కడు ఆశ్చర్యముగా బోరుచున్నారే! (ఇంచుకపరికించి) ప్రియస్నేహితుఁడా, ప్రలంబా! వారినేర్పునకేమి లెమ్మా ప్రక్కనొక్కింతసేపునిరీక్షించి పరీక్షింపుము.

ఉ. హుమ్మని హుంకరించుచు ను।గ్రహలాయుధహస్తుఁడై చి
త్రమ్ముగఁ గుంభునిన్ గదిసి । దారుణమైన శరాళిచేత ర
క్తమ్మును గ్రక్కగా తనువు । కండలు కండలు గాగ జెందుచున్
ఇమ్మహిఁగూల్చె భీరమున । నేర్పడఁగన్ బలరాముఁడుగ్రుఁడై.

ప్రలం—(ముందుకుఁజూచి) అదిగో హలధరుని ముష్టిఘాతంబున కుం
భాండుఁడు ధరావలయంబునఁబడి గిరగిరఁదిఱుఁగుచు ధరాపా
తంబుగా రుధిరంబు గ్రక్కుచు మరణించుచున్నాఁడే?

రక్త—ప్రలంబా! అమూలజనుగుచున్న వీరపనోదంబు గనుగొనుము.
ప్రళయరుద్రునిభంగి భయంకరాకారంబున మనయువరాజు
గారు సాత్యకిని గవయుటకే గాఁబోలు మేఘగంభీరధ్వనుల
చే నేదియోపల్కుచున్నాడు.

ప్రలం—అవును. మనమించుక నాలకింతము. (వినుటనభినయించును.)

(తెరలో)

శా. ఓగోరీ యదువంశపాంసన! కుల।ఘ్నోద్దీప్త బాహాబలం
బేరాజిల్లిన భీకరాస్త్రములనే । యేలీలఁజూపించెదో
రారా! పోరొనరింపనస్గదిసి దు।ర్మార్గా! భవద్వైకృమే
పారన్ జూపర నీచకర్మసుఁడ గ । ర్వంబేలరా దుర్మతి.

అబ్బా! గుండెలు బ్రద్దలగునట్లు భీకరార్భాటంబులచేఁ బరస్పర కల
హంబునకు వెనుకంజవేయక యెదుర్కొనుచున్న యువరాజ సాత్యకు
లిట్టే వచ్చుచున్నట్లున్నది. మన మాసాంకేతిక స్థలంబున నిలచి వీరి
యుద్ధనిపుణతఁ జూతము. రమ్ము (ఇరువురు నిష్క్రమింతురు.)

[ప్రవేశము సాత్యకి చెయ్యిఁ బట్టుకొని బలుఁడు పైపద్యమును
జదువుచు ప్రకాశముగా.]

"శా. ఓరోరీయదువంశపాంసన కుల।ఘ్నోద్దీప్త బాహాబలం"

ఛీ. ఛీ. యాదవకులాధమ భారభూతా! సాత్యకీ! మదీయక్రూరనా
రాచానేకదివ్యాయుధంబుల చవిఁజూతువుగా. రా; రమ్ము.

సాత్య—ఛీ! పాఱుఁబోతా! అపకీర్తిపరాక్రమవంతుండనని చెప్పు
కొనుటకైన లజ్జింపక మాటలచేఁ బోటరివలె ధాటిఁజూపు
నీలాంటివారల నేల దేవాసురులకైన నవలీల జయించు నాతో
బీరంబులాడుచున్న నీనాలుక వేయిచీలికలు గావించెదఁ జూచి
కొమ్ము. పలలాశనా! మదోన్మత్తుండవై ఆంజనేయునెదుటఁ
గుప్పిగంతు లనుచందంబున నాముందట నీనిష్ఠురాలాపంబు
లేమిపనికివచ్చునురా?

మ. ఖలుఁడా! నీదు శిరంబు నేఁడసిని వేఁడ్కన్ గూల్చి నీతండ్రికిన్
పలుదుఃఖంబులు గల్గఁజేసి దివికిన్ బంపంగ నేనుంటి నో
తులువా! యేటికిఁ గొల్ల మాటలిఁక నీదోర్వీర్యమేదేది చూ
పి లసత్కీర్తిని గాంచుమోరి ఖలుఁడా పృథ్వీస్థలంబందునన్.

దుర్మద కంఠలుంఠనంబైన మత్కఠోర కుఠారంబునకు శరణ్యమయ్యె
దవుగాక కాచికొమ్ము. (గండ్రగొడ్డలిఁ బూనును)

బలు—ఓరీ తుచ్ఛా! యిదిగో,

శా. వాయవ్యాస్త్రమిదే కనుంగొనుము గర్వాంధాభవచ్ఛిన్నమున్
దీయున్నొక్కనిమేషకాలమున ధాత్రిన్నేలలాడంగ నీ
చా! యుద్ధంబున నన్నుమార్కొనుట కాశంభుండె భీతిల్లు నీ
వా! యుగ్రాకృతితోడఁ బోరుదువు ఆహా వింతగానున్నదే.

సాత్య—ఛీ! అసంబద్ధ ప్రలాప, ఆత్మశ్లాఘీ. ఏమిరా! నీకండకావ
రము? ఇంతవరకుపేక్షించినందులకు మదోన్మత్తుండవై యొ
డలెఱుంగక మిడిసిపడ దొడంగితివా! ఇదిగో కాచుకొమ్ము.
శత్రుజన భీకరంబైన యీబ్రహ్మాస్త్రంబునఁ గూలెదవుగాక.
(అని బ్రహ్మాస్త్రంబు విడుచుచు) చచ్చితివిరా! చచ్చితివిరా!

బలు:—హా, హా, (అని క్రిందఁబడును)

సాత్య—(తనలో) మేలు మేలు. బాహుగర్వోపేతుఁడగు నీబలుని మదీయశరపరంపరలచే గూల్చి కృతకార్య ధురంధరుండనైతి. (ఇంచుక ఆలోచించి) ఏమిది! పవిత్రుండగు నాసోదరుని నెవఁడో తూలనాడుచున్నాడు. (వినుట నభినయించును.)

మ. మదిరాపానము గాదుగోరి బలరామా! నీవు ద్రావంగ దు
ష్పథభీతాహరణ ప్రదేశమునఁ గాల్వల్వారురక్తంబుగా
ని ధరాభీరజనంబుగాదు ఘనతూణీరాస్త్ర విన్యస్త యా
యుధపాణుల్ గలరీ స్థలంబునకు అయ్యో రాకు నీలాంబరా.

ఔరౌరా! కంసగర్వంబున లోకపూజ్యుఁడగు మదగ్రజుని నిచ్చవచ్చినట్లు పేర్లన్ జొచ్చు నీ కుంభాండుని భూమండలంబునఁ బడునట్లు గావించెదగాక (అని నిష్క్రమించును.)

[సాంకేతస్థలంబున బాణాసురుఁడు, రక్తదంతుఁడు ప్రవేశింతురు]

బాణా—ఓరీ! సేవకా! త్రిలోకి భయంకరుఁడగుచు ప్రతాప శౌర్య సాహసంబున సమస్తవైరివర్గనిర్మూలనకారకుండగు ముక్కంటి నెక్కటి కయ్యంబున గొల్లనిచే పరాజయ మెట్లు పొందెను?

రక్త—మహాప్రభూ! భవచ్ఛేనాసమూహంబులోఁబడి మిడుతలను గాల్చు వైశ్వానరునిభాతి భాసిల్లుచుండ సహస్రమదగజ బాహుబలుండగు మనద్వార రక్షకుండగు శంకరుండు యీ యదుకిశోరమును దాకి ఘోరంబుగా సంగ్రామంబు గావించెను. వారిరువురు దలఁపడ రథగజ తురంగ కాల్బలంబులు నుగ్గునూచమై యొప్పుచుండ మరియొకప్రక్క బలరామ సాత్యకి ప్రద్యుమ్నాది వీరులు మన సేనాధిపతులతోఁ గయ్యంబున కియ్యకొనిరి.

బాణా—తరువాత నేమిజరిగెను?

రక్త—దేవా యిట్లిరువాగులవారు ఘోరంబుగా రణవినోదంబున నోలలాడుచుండ కూరిరుండగు సాత్యకి ఘోరాస్త్రంబుల బూని యువరాజుగారిని దాకి యనేకాస్త్రంబులఁ బఱపి తూణీరంబునగల బాణంబులైన నందుకొనుట కవకాశంబిడక తన శర వర్షధారాపాతంబున బలమహారాజసార్వభౌముని ధరావలయంబున బడునట్లుగావించెను.

బాణా—(తనలో) హా కష్టము; కష్టము. (మూర్ఛిల్లును.)

రక్త—ఉపచారములు సేయును.

బాణా—(లేచి) హా! కుమార! హా త్రైలోక్యవీరా! నీకింతటనే వత్స రశతంబుగడచెనా? తండ్రీ! నీ ధైర్యసాహసంబుల బరికింప సకలలోకభయంకరుండవగుచు పదునాల్గుభువనంబుల కాధిపత్యముఁ బొందుదువని కడుసంతసంబున నభివృద్ధిగాంచు నాయాశాలతను ద్రెంచివైచితివా తనూభవా! (మూర్ఛిల్లును.)

రక్త—మహాత్మా! నిఖిలధర్మాధర్మ పరిజ్ఞాతుండవగు నీవే యిట్లు చింతించిన మాదృశులపాటేమని చెప్పఁగిలను. దైత్యకులపారావారగంభీరరాకాసుధాకరా! లెమ్ము; లెమ్ము; (అని లేట్టును.)

బాణా—(లేచి) హా శంకరా! దీనబంధుండవగు నీవుండగనే నేపుత్ర శోకాగ్ని తప్తుండను గావలసివచ్చెను. దేవా! ఇంక నేమొనరింతును. (విచారించుచుండును.)

రక్త—బాణాసురమహారాజా! కించిజ్జులచందంబున మీరిట్లువిచారించుచుండ ధర్మమగునా! ఇఁకముందుక ర్తవ్యమరయుఁడు.

మ. తనయుఁడీల్గెనటంచు నీవిటులఁ జిం । తన్ బూనియొప్పారఁగా
ఘనులౌ నాబలరామకృష్ణులను సం । గ్రామంబులో గెల్చు శూ

రుని వీక్షించుట దుర్లభంబేకను ఆ! మూఢప్రతాపోన్నతిక్ర
దనుజానీశ్వర! రమ్ము రమ్మిపుడె యుద్ధక్రీడ సంధాయివై.

బాణా—ఓరీ రక్తదంతా! నాసుతనాశకుండగు సాత్యకిని నెవరైను గొనకుంటిరా?

రక్త—ఎదుర్కొనకేమి. బలరాముండు చలంబున కుంభాండుని గదాఘాతంబున బుడమింబడఁజేయ నుభయపక్షములందుగల రథికులు రథికులు నాశ్వికులు నాశ్వికులును గజారోహకులు గజారోహకులును బదాతులు బదాతులును దలపడ నితరేతర హేతి సంఘట్టనంబున మిణుగురులుజెదర బరస్పరాహ్వాన బిరుదాంకిత సింహనాద హుంకారశింజనీటంకార మదగజ ఘీంకార తురగహేషారవంబులను పటహకాహళ భేరీ మృదంగ శంఖతూర్య ఘోషంబులను బ్రహ్మాండభాండంబులెల్ల బ్రద్దలగునట్లు చేయుచు నందు వీరపుంగవులెల్లరు భుజాస్ఫోటనంబొనరింపుచు నెదుర్కొను మనబలంబునశించుటయు శత్రువుల దాడిహెచ్చుట వీక్షించి మీయెడ విన్నవింపవచ్చితిని.

బాణా—హా! ఏమిది ఆశ్చర్యము! సురాసురప్రకరమునైన నవలీల గెల్చు గరళకంఠుఁడే పరాజయమంద నింక దక్కినవారిగతి లెక్కయేల. (ప్రకాశముగా) రక్తదంతా! దుర్మార్గులగు యాదవులపైకి నా మూలబలగంబును బురికొల్పుకొని నీవిఁకసత్వరంబుగా రమ్ము; పొమ్ము.

రక్త—ఆయుష్మంతుఁడా! చిత్తము తోఁగావింతును.

(అని నిష్క్రమించును)

బాణా—(తనలో) ఓరీ! యదువంశపాంసనా? ఇంతవరకు నాబాహు విక్రమాటోపంబు గుర్తింపకుంటచే కండగర్వంబున జరించు నీయుత్తమాంగము తుత్తునియలు గావించెద గాచుకొమ్ము.

(బాణాసురుఁడు నిష్క్రమించును.)

[యుద్ధరంగమున కృష్ణుఁడు-ఒంటరిగాఁ బ్రవేశించి]

(తనలో) అహా! ఏమి యీచిత్రము! భుజబలగర్వాంధకార విధ్వంసభానుండనగు నాప్రతాపమెఱుంగక హరుండు నన్ను రణంబునడీకొని మూర్చాక్రాంతుఁడయ్యె నాఁడే (ఆలోచించి) కానిమ్ము సహస్రబాహు గర్వితుండగు బాణాసురాధముని అఖర్వంబగు గర్వమడంచి పుండరీకకాసారంబునఁ బడు వేదండంబుచందంబున రిపుదళంబును జొచ్చి చెండాడెదగాక. (ముందునకు నడచి) ఏమిది! పిడుగువలె యలరు నీధ్వనియెవ్వనిదైయుండును! (వినుట నభినయించును.)

(తెరలో)

మ. అనిలోశంకరుగెల్చినాఁడనని గర్వాంధుండవై నీవు బా
ణునిశక్తిన్ నెఱుఁగంగ లేకచను నిన్నుం బోవగానిచ్చునా
దనుజాధీశకులాగ్రగణ్యుని వరాస్త్రజ్వాలలన్ నోర్చి సం
జనితక్రోధవిలాసతేజమున కృష్ణా యుద్ధముల్ సేయరా.

దండిబలుండనని మొండిమాటలాడు నీతడు బాణుఁడుకాఁబోలు. రానిమ్ము, వీని విల్కు మార్చెదగాక. (అని ముందుకు నడచును,)

"మ. అనిలోశంకరుగెల్చినాఁడనని గర్వాంధుండవై నీవు బా"

[ఈపద్యముజదువుచు బాణుఁడు ప్రవేశించి]

బాణా—ఓరీ! రాజవల్లభా! ప్రగల్భా! అసంబద్ధప్రలాపా! హీనకులసంభవా!

మ. కదనక్షోణిని నీకుశీర్షమును ము|క్కల్ జేసి రక్తంబుతో
బదలిర్పంగను నాల్గుదిక్కులను భీ|భత్సంబుగావించి నీ
దుదముట్టించెద నీదుమాంసమును నెం|తోప్రీతి భూతాళి మె
క్కెదరాపైన నిమేషకాలమిట న|క్షీణప్రభన్ నిల్వరా,

కృష్ణు—ఓరీ దైత్యకులాధమా! వృథావాక్ప్రయాసంబున డస్సి కృశిం
చెదవు. నీయభిమతపరికారంబున నిన్నిదే కాలునిపాలికంప
సిద్ధముగానుంటి రారమ్ము. నీయట్టివారు వేనవేలైనను
యీ శ్రీకృష్ణుండు సంగరంబున బరాజితుండగునా?

బాణా—ఓరీ వెఱ్ఱిగొల్లా! నీవెంతమందబుద్ధిగలవాఁడవురా? రణం
బన్న నేమిగాఁ దలంచితివి?

సీ. గోపాంగనలనిక్క | గుబ్బపోటులుగావు
వేడిజూపెడుబాణ | వితతిగాని
మనసారగా బూయు | మంచిగంధముకాదు
రక్తపంకిలసంగ | రంబుగాని
పీనులకింపైన | పీఠాననముగాదు
ఘీంకృతాభీల హుం | కృతులుగాని
చరియింప కేళిల | సౌఖ్యభూములుగావు
అస్త్రశస్త్రయుతమైన | యవనిగాని

తే. గీ. అంబయొసఁగినట్టిగా గోగ | ణంబుగాదు
భయదనిర్ఘాతసంఘాత | భటులుగాని
భళిరరణమన్న నేమిగా | దలఁచితీవు
బీరమేటికి ద్వారకక్ | జేరఁబొమ్ము.

ఓరీ! మాయకాడా! నీమానవ్వు కృత్యములు, నీపలుకులు, నీశౌర్య
ధైర్యసాహసాములు నేనెఱుంగనివా? తెలిపెద నాలకింపుము.

సీ. ఆభీర యువతుల । యంబరంబులు చాల
నెత్తుకపోయి చె । ట్లెక్కినావు
ఇల్లిల్లు దిరిగి వే । పల్లె వాడలలోన
జున్ను మీగడ పాలు । జుర్రినావు
పందగా గోపాల । బాలురతో గూడి
యెంగిలిచల్దులు । మ్రింగినావు
విషయేచ్ఛలో మున్ను । ఋషిభార్యలను జేరి
చెడు కార్యములు నెన్నో । చేసినావు.
తే. గీ. జారచోరాది క్రియలందు । జాలప్రజ్ఞ
గలదు నీకింక వేరుగా । దెలుపనేల
బ్రదుక నెంచిన జేరుము । ద్వారకకును
నిలచియుండిన నీచావు । నిజము కృష్ణ !

కృష్ణు—(నవ్వుచు) ఏమేమి. ఇంతవరకు కంఠశోషపడి చాల అల
సినట్లున్నది. ఒక్కింతసే పిచ్చట విశ్రమించి శ్రమనివారించు
కొనుము.

బాణా—నీచాధమా ! ఏమిరా నీతుచ్ఛపాటు. నన్నుఁ బరిహసింపు
చుంటివా ? ఇదిగో కాచికొమ్ము. (బాణములనుఁ బూనును.)

కృష్ణుఁ—ఓహో ! చూచుచుండగనే నీమద మడఁకమగుచున్నయదే.
కానిమ్ము.

ఉ. నీరథులున్ కలంగికడు । నింకిన నింకగనిమ్ము చండ దు
ర్వార పరాక్రమాఢ్య నను । వజ్రిపురందర ముఖ్యదిక్పతుల్
చేరి నినున్ దయన్ గనగ । శీఘ్రమె వచ్చిన రాగనిమ్ము మ
త్తీవ్రశిలీముఖంబులకుఁ । గూలక నీవెటులుందువో ఖలా !

ఓరీ ! పలలాశనా ! వనపాలకుండు తాళఫలంబుల గూల్చుకరణి నీస
హస్రబాహువుల వైరి నిర్మూలనంబు సేయునా చక్రంబున దెగటార్చి

నీశిరంబు ధరావలయంబునఁ బడఁ జేసెద రా, రమ్ము.

బాణా—(శిరఃకంపనము సేయుచు.) ఓరీ! నీచకులసంభవా! గార డీవాని చేతులోనుండు పెనమువంటి నీచక్రమునకు, మద్యపానాపేక్షితుండగు నీయగ్రజుని నాగలిదుంపకు వెఱచి భయపడుదునా?

కృష్ణుఁ—మూర్ఖుఁడా! నీకు మరణకాల మాసన్నమగుట జేసి లోకపూజ్యుండగు నాసోదరుని దూషించుసట్టి సద్గుణసంపన్నుఁడ వైతివి గాబోలు. ఇదే యీసన్నిధానప్రదేశంబున నీప్రతాపంబు గనుపింపఁ జేతువుగాక రమ్ము- (ఇరువురు నిష్క్రమింతురు.)

[మఱియొక ప్రక్క బలరాముఁడు, సాత్యకి ప్రవేశింతురు.]

సాత్య—భ్రాతృవత్సలా! ఆసురాత్ముండు చిన్నన్నయ్యగారి వాడి బాణానలంబునకుఁ దాళ లేక కడుబడలి సిటలతటంబున భృకుటిద్వయంబు నటనంబు గావింపుచు చటులహుంకృతిచే బాహుసహస్రంబునఁగల యనేక దివ్యాస్త్రంబు లరిబోసి నభోమండలంబున మెఱయు మెఱుపుతీగచందంబున నెంతసాహసంబునఁ బోరుచున్నాఁడో.

బల—తమ్ముఁడా! సాత్యకీ! అస్త్రంతలఁ పడు దానవాధిపుని శరంబు లన్నియు మధ్యనే విరుగఁజేసి కుప్పకుప్పలుగా బడునట్లు సల్పి మన శ్రీకృష్ణుఁడు తనరణనిపుణత పెంపుసొంపార ప్రతిపక్షజనకాంతారవీతిహోత్రంబన వెలుంగు చక్రరాజంబును గిరగిర ద్రిప్పుచు.

సీ. శాత్రవశరయుక్తి । సంగ్రామ రంగంబు
యజ్ఞవాటిక భాతి । నలరుచుండ
తన చేతి చక్రాగ్ని । మునిజ నార్చ్యంబైన
నవనాగ్ని కాగను । నివురుచుండ

బాణాసురుని దీర్ఘ । బాహుసందోహమే
యింధనంబుల రీతి । నెసగుచుండ
కదన భూమినిబాహు । కండర స్తంబులే
యుజ్జ్వలాజ్యంబుగా । నొప్పుచుండ.

తే. గీ. కఠిన వాక్కులె మంత్రసం । కల్పములుగ
ధైర్యబలధుర్యు లరయ న । ధ్వర్యులట్లు
తాన హోతగ నిల్చి యు । ద్ధంబనియెడు
మఖము సేయుచున్నాడు స । మంత్రికముగ
కిల్బిష విదారణుండు శ్రీ । కృష్ణుం డిపుడు.

సాత్య—అన్నయ్యా ! బలభద్రా ! ఇట్లు విఫలోపకరణ మనోరథుం డగుచు నారక్కసుం డుక్కుమిగిలి సింగముభంగి చెంగుచెంగున గంతులు వైచుచు భగ్నహృదయుండై మరల మార్కొనుచు నేదియో పలుకుచున్నా డాలకింపుడు.

బల—ఆయుష్మంతుండా! అట్లే చేయుదము. (వినుట నభినయింతురు.)

తెరలో

ఉ. ప్రాణములున్నదాక నిను । భండనసీమను వీడంజాల నో
హీనచరిత్ర నిన్నిట స । హింపకృతాంతుని పీటికంపంగా
బూనెదం జూడుమింక కడు । మూఢుండవై కనుమిన్నుగానకే
దానవలోకనాయకుని । దాకగశక్యమె నీకు దుర్మతీ.

సాత్య—(ఆతురతతో) అయ్యయ్యో ! ఇదేమిది. చూచుచుండగనే కఠోరంబగు కుఠారంబుం బ్రయోగించుచున్నాడే. హా ! కష్టము. కష్టము.

బల—నాయనా ! నీకే భయమేల అటుంజూడుము. వాని కుఠారంబు నవలీలంగాం దున్మాడి త్రిలోకభయంకరం బగునారాయణాస్త్రం బరివోసి వేయుచున్నాడు. పరిశీలింపుము.

సాత్య—దేవా! అనారాయణాస్త్రంబునకు భయపడి యేదియో యనుచున్నాడే.

బల—సాత్య—(ఇరువురు పరికించి వినుట నభినయింతురు.)

తెరలో

మహాత్మా! యదుకిశోరసింహమా రక్షింపుము. రక్షింపుము.

ఉ. వచ్చితిఁ జచ్చితింక నుపసం । హరణంబును జేయుమస్త్రపుం
జిచ్చు భరింపఁ జాల సర । సీరుహలోచన నేటినుండి నీ
సచ్చరితంబు నెల్లెడలఁ । జాటుచునుండి హితంబుగోరెదఁ
అచ్చపుభక్తిచేతఁ బర । మాద్భుతముల్ గదనీదుసంగతుల్.

బల—వత్సా! చూచితివా! మన శ్రీకృష్ణుని వాడిముల్కుల దాడికి భరింపలేక పదంబులపైఁబడి వేడు నాయధమాధముని కేశపాశంబుల బిగబట్టి యీడ్చుకొనివచ్చు నీయన విక్రమాతిశయంబు వర్ణింప హరిహరబ్రహ్మాదులకైన నలవికాదుగదా.

సాత్య—అగ్రజా? సోదరున కభిముఖంబుగా జనుదము రండు.

బల—మంచిది. అట్లేకానిమ్ము. (ఇరువురు ముందునకు నడతురు.)

[బాణాసురుఁడు, శ్రీకృష్ణుఁడుఁ బ్రక్క ప్రవేశింతురు]

బాణా—(పాదములపైఁ బడి) మహాత్మా! నీయనన్య విక్రమం బెఱుంగఁ గోరి మదవికారంబున నిన్నుఁ దలపడి మిగుల దుర్భాషలాడితిని. క్షమింపుము. క్షమింపుము.

చ. తెలివియొకింత లేక యతి । ధీరుఁడనంచును విఱ్ఱవీఁగ నీ
బలమును గాంచజాలక ప్ర । భండనసీమను జేరి నారసం
బులను బ్రయోగముల్ సలిపి । మూఢుఁడనై చరియించినాఁడ సన్
దలపడనేల నిక్కృపను । దప్పగదే కరుణాపయోనిధీ.

కృష్ణు—(బాణుని లేవనెత్తి) దానవేశ్వరా! ఇంతటినుండి మాబోంటి వారల నెదుర్కొనక సుఖంబుగా వర్తింపుము; పొమ్ము— (బలరామునితోటి) సోదరా! ఇంకఁ గావలయున దేమున్నది.

బల—కారాగారనివాసుఁడగు అనిరుద్ధకుమారుని బంధవిముక్తిగావించి సంరక్షించు టవశ్యకర్తవ్యము.

బాణా—మహాశయులారా? నేనొనర్చినతప్పిదంబుల క్షమించి మీతో వియ్యమొసఁగ ననుగ్రహింపుఁడు.

మ. మనసారన్ వరియించె మత్సుతను సన్మానింపగా నిల్లుమీ
యనిరుద్ధున్ బతిగానొనర్చి కడునాహ్లాదంబుగా వియ్యమం
దినచో ధన్యుఁడ నయ్యెదన్ బిదప కీర్తిన్ గాంతు నిక్కంబుమీ
రనుమానింపగ నేల..........................................

శంక—[ప్రవేశించి] నీలాంబరా! మీకీతనియందుగల నైసర్గికశత్రుత్వము వదలి యీతనిదుహితను నీమనుమరాలిగా స్వీకరింప కరుణింపుడు. కరుణింపుడు.

బల—మహాత్మా! తావకాజ్ఞ శిరసా వహించెదముగాక. ఇఁకఁ గావలయున దేమున్నది.

శంక—మన మిఁకఁ వివాహప్రయత్నంబుల గావింతము. రండు.

బల—చిత్తము. (అందఱు నిష్క్రమింతురు.)

చతుర్థాంకము సమాప్తము.





# ఉషాపరిణయము

అను

# అనిరుద్ధవిలాసము.

## పంచమాంకము.

[ఇంటియందు సుబ్బలక్ష్మి ఒంటరిగా ప్రవేశించి తనలో]

సుబ్బ—(తనలో) కటకటా! గతిలేకపోయిన యీవృద్ధవిప్రునిసమాగత మేల పొందుపరచితివోయి- అక్కా! రెండుజాములైనను ఆతండు పిండమునకుంగ వచ్చి చచ్చునట్లు దోచకున్నదే (ఆలోచించి) ఏమి వానిమాయలు! నేను ఇన్నేళ్లయు కనక వర్షము కురిపిస్తానని కల్లబొల్లి యేడ్పులేడ్చి నాచే తాడనంబులం దప్పించుకొన్నాండు- రానిమ్ము. నేను రూక తేతే కున్న దండతాడిత భుజంగంబుభంగి మండిపడి యాతనికండకావర మడచెదగా, (ముందుకుంజూచి) అదిగో! రానేవచ్చె రాజగోపాలమన్నట్లు నుడి తడబడ గడగడ వడంకుచు నుడిబడ దిరిగి పుడమినడుగిడంజాలక భూలోకభ్రాంతియే లేక యాముసలివాడు యిటే వచ్చునట్లు తోచెడిని. నే నీమూలలను దాగియుండి యాతని యాలోచన నాలకించెద.

(మూలనునిల్చును)

[రామశాస్త్రి ప్రవేశము.]

అక్కటక్కటా ! రొక్కము చేజిక్కునని నేనక్కడకఱుగ నామక్కువతీఱదా మెనే- పెక్కుయిక్కట్ల కోర్చి నాకక్కఱకువచ్చునుగదాయని లెక్కచేసి నేగడించిన ద్రవ్యమెల్ల నీయుద్యమము పాలుగావింప నాపై నిప్పుడు కయ్యంబున కరుదెంచు నీగయ్యాళిముండబాధ నెట్లుతప్పించుకొందును. హా ! దైవమా ! ముందు నుయ్యి వెనుక గొయ్యి అను చందంబున నున్నదే !

ఉ. కాసులు లేకయున్న గుల కామిని నాయెడ గోపమూని యా
యాసము తోడియున్నను న హంకృతి మానదు దైవమా! యిఁకే
నాసతి చర్యగన్గొనన నారతమున్ మదిభీతిగల్గు రా
కాసియనంగ వర్తిలను కాంతనుగూడిన సౌఖ్యమున్నదే.

(ముందుకుఁజూచి) అదిగో ! కొంపమునిగినట్లులే యున్నది. ఏమూలఁజూచినను నాప్రియసఖీమణిముఖమైనను గాన్పించుటలేదే ! అయిన బిలిచిచూచెదగాక (ప్రకాశము) సుబ్బలక్ష్మి !

సుబ్బ—(తనలో) ఔరా ! పీనికండకావరముగాల- నాకడ కరుదెంచి కృత్రిమమోహంబున నాచెట్టబట్ట వీక్షింపదలపెట్టినటులదోచుచున్నయది. (ఊరకుండును.)

రామ—(మరల) సుబ్బలక్ష్మి ! సుబ్బలక్ష్మి ! (అని పిలచును.)

సుబ్బ—తొండముదిరి యూసరవెల్లి యగునట్లు ఆతని పని శ్రుతిమించి రాగంబునఁ బడుచున్నదే- (మాట్లాడక యూరకుండును.)

రామ—ఓ సుబ్బీ ! పిలచిన పలుకవేలనే ? అలుకయేలనే ?

సుబ్బ—ఇంక యుపేక్షింపరాదు. (ప్రకాశముగా) ఎవరినిరా పిలచుచుంటివి. (అని చీపురు చేబూని సమీపించును.)

రామ—(గజగజ వణకుచు) నిన్ను- ని...... న్నే... నే !

సుబ్బ—ఏమేమి నీ కండకావరముగాల- ఆముముండకు పిండముపెట్ట లేని యధమాధముండవై మొండితనంబున బొట్టుగోసి పేరుం బెట్టినట్లు "సుబ్బీ" అని పిలువందొడంగితివా? (కొట్టు చుండును,)

రామ—అబ్బా! కొట్టకే- కొట్టకే- పెద్దవాండనే- (వణకుచు నిలు చుండును.)

సుబ్బ—నీ పెత్తనము మొగ్గలపాలుగాను- నీవు ఎవ్వరికిరా పెద్దవు! (మరల కొట్టుచుండును.]

రామ—రామా! రామా! చంపుతావే; చంపుతావే,

సుబ్బ—విత్తములేని తొత్తుకొడుకు చచ్చిన నేమి; బ్రతికిన నేమి.

రామ—ప్రాణసఖీ! ఇంకా వినవే. తింగా తింగా రుచులడిగినట్లు చెప్పు వాక్కు నాలుకకే యిట్లు పరిహరింపసాగిన నే నేమి సేయుదును.

సుబ్బ—ఆ యేమనేమిరి. ఈవేళ డబ్బు దొరక లేదనియేనా?

రామ—కాదు; కాదు; నేను మనరాజుగారి యింటియందు పాణిగ్రహణంబు జరుగునంట- అందు మనయిద్దరికి దంపతితాంబూలంబు లర్పింపందలంచిరి. అంతవరకు నోపికపట్టుకొన్నచో నీయొడలెల్ల కనకసిక్తముగా జేసెదను.

సుబ్బ—చాలు- చాలు. ఇంతకు నిప్పుడేమియు దేలేదనియేనా?

రామ శూన్యహస్తుండనై వచ్చితినని కాదు- ప్రభువుగారి తనయ పరిణయముదాక విరమించిన నీ యిత్తెల్లయు సువర్ణస్నానము గురి పించెదగాక.

సుబ్బ—ఓరీ! నీమాయలు కాల- నల్లపూసలోనికి తెల్లపూస జేయించలేని యనాధవు నీవు నాకు భూషణంబులు తెచ్చి

యప్పించెదవా! సరి సరి. డబ్బులేకున్న యిప్పుడు పిండమెటుల లభించుననని వచ్చితివి? (మెడబట్టి గెంటును.)

[బహిర్ద్వారమున రామశాస్త్రి ప్రవేశించి]

(తనలో) హా! దైవమా! ఎక్కడిశ్రాద్ధంబులంతైన నరకాసు బోనీయక కూడబెట్టిన విత్తమెల్లయు నీ తొత్తు సొత్తుగావించినను చిత్తమువచ్చినంత విత్తము తే లేదని నానెత్తిపై సత్తువచే గొట్టుచున్న యీరక్కసిబాధ నెట్లు తప్పించుకొందును. (ఆలోచన నభినయించి) కానిమ్ము. ఈవేళ రాజుగారియింటిలో జరుగు వివాహమంటపమున వచ్చు రూకలు చేకొని దీనికర్పించి సుఖంబుగా వర్తింతునుగాక.

(రామశాస్త్రి నిష్క్రమించును.)

[కళ్యాణమంటపమున బల, కృష్ణ, సాత్య, శాణా, శంకర, అనిరుద్ధ, నార, రామ, దీక్షితులు, మణిమాల, ఉషా కన్య మొదలగువారలు ప్రవేశింతురు.]

రామ—(అపవారితముగ) దీక్షితులూ! ఈ వివాహమంటపమున వచ్చు సర్వవస్తువులు నావియేసుమా?

దీక్షి—ఎట్లెట్లు? రాజాశ్రితను, పౌరోహిత్యము, సభాపత్యము, ఈమూడధికారములు నీవే నాంఛ-

రామ—ఇంక నందులకు సందేహమేమున్నది-

దీక్షి—సందేహముగాక మనకు పొందెట్లాకల్గును? వివాహమెల్లా చేయించడము నావంతు. పాణిగ్రహణకట్నమంద నీవంతా!

రామ—(తనలో) ఈతనినించుక భేదనోపాయంబున భయపరచి యిందువచ్చు విత్తమెల్లయుం గైకొనెదగాక- (ప్రకాశముగా) దీక్షితులూ! అక్షరమురాని కుక్షింభరుడవు. సభాధ్యక్షత వహించి కార్యమునిర్వర్తింప సమర్థుడవగుదువా?

దీక్షి—ఓరీ రామశాస్త్రీ! అక్షరమురాని పక్షివి నీవా- నేనురా?

రామ—చాలుఁ జాలు. నోరుమూయుము- లేకున్న ప్రభువుగారితో చెప్పి శాస్తిగావించెదను.

దీక్షి—ఛీ! ఏమిరా నీవాచాలత్వము. పండితుండనని మిడిసిపడు చుంటివా! మఱల మాఱుబల్కిన నీ నాలుక దీయించెదను గాక నూరకొమ్ము.

రామ—(తనలో) అబ్బా! ఈతఁడు మొండిమాటలయం దప్రతిహతంబగు నైపుణ్యము సంపాదించియున్నాఁడు. వీనితోఁ గలహింపక సభ్యతచే చావగొట్టి కృతకార్యుఁడనయ్యెదగాక. (ప్రకాశముగా) మిత్రమా! దీక్షితులు! నీవేమందువో యని యిట్లు పల్కితిని గాని వేఱేమున్నది! మనలోమనము కలహించినచో రాజుగారు మనకు తగినశిక్ష విధించును.

దీక్షి—నిజము- నిజము.

బాణ—భూసురోత్తములారా! ఇంక నేల యాలసించెదరు?

దీక్షి—దేవా! దంపతుల నిరువుర నీభద్రమంటపమున గూర్చుండ బెట్టుఁడు.

బాణా—కమలా! అమ్మాయి నిట్లు గూర్చుండ నియోగింపుఁడు.

(మంటపమున అనిరుద్ధుఁడు, ఉషాకన్య నిలచియుందురు.)

దీక్షి—రామశాస్త్రిగారూ! ఉపక్రమింపుఁడు.

అయంముహూర్తః సుముహూర్తోస్తు. తదేవలగ్నం సుదినంతదేవతారాబలం చంద్రబలం తదేవ. విద్యాబలం దైవబలంతదేవలక్ష్మీపతేతేంఘ్రియుగం స్మరామి.

రామ—ఇఁకమనము లగ్నాష్టకాలు ప్రారంభింతమా? ఓరీ! నీకడుపుగాల; మంత్రాక్షతల నివ్వకయే వివాహము సేయింపఁదొడంగితివా?

దీక్షి—రామశాస్త్రిలుగారూ! అయ్యా మఱచితినండీ. (అని అక్షత లిచ్చును.)

దీక్షి & రామ—

శ్లో. శ్రీరామపత్నీ జనకస్యపుత్రీ। సీతాంగనా సుందర కోమలాంగీ।
చంద్రాననాచారుగుణాన్వితా సా। వధూవరాభ్యాంవరదాభవంతు.

శ్లో. పతివ్రతాలక్షణ లక్షితాంగీ। సన్మార్గగామీ శుభసౌఖ్యదాచ।
అరుంధతీనామ వశిష్టపత్నీ। వధూవరాభ్యాం వరదాభవంతు.

సావధాన సుముహూర్త సావధాన శ్శుభలగ్న, సావధాన లక్ష్మీ నారాయణా చెంతలసావధాన.

మం. ధృవంతే రాజావరుణో। ధృవందేవో బృహస్పతిః
ధృవంత ఇంద్రశ్చాగ్నిశ్చ। రాష్ట్రంధారయతాంధృవం.
అయంముహూర్తస్సు ముహూర్తో అస్తు—

(అందరు దంపతులపై అక్షతలు జల్లుదురు.)

బాణా—(అనిరుద్ధుని దగ్గఱకుఁ దీసికొని) నాయనా! అనిరుద్ధా! మందబుద్ధినై నీయందు గావించిన దోషంబులెల్ల క్షమింపుము.
[ఉషాకన్యచేయి అనిరుద్ధుని హస్తమందిడి] చిరంజీవి!

సీ. ఆకలియగుచున్న। దనిదైన చెలువను
కాంత నెట్టుల గార।వింతువన్న
మొత్తనిపాన్పున। మెయిఁజేర్చు నోచ్చు నీ
యతివ నెట్లులనీవు। నరయుదన్న
పుష్పవసంబుకు। బోవభీతిల్లు నీ
పొలఁతి నెట్లుల ప్రీతి। బ్రోచెదన్న
సుకుమారురాలుసీ। సుందరాంగిని నెట్లు
రక్షించెదో ధీర। రాచమిన్న

అనుకూలుఁడగు నాథుఁ । డబ్బెగాయనిమదిఁ
కండగర్వంబున । నుండకమ్మ
తే. గీ. దైవభక్తిని నెప్పుడు । దలపవమ్మ
పిన్నపెద్దలయందున । ప్రేమనిడుమ
స్థిరతరానందకీర్తిని । జెందవమ్మ
రక్షినొందరు సతతమ్ము । మున్నగుమ్మ.
శంక—దైత్యనాయకా ! నీవుకడుంగడు కృతార్థుండవైతివి. సకలభువ
నాతీతుండగు నీయదుసంభవునితో వియ్యమొందిన నీభాగ్యం
బుఁ గొనియాడ నాదిశేషునకైన నలవియగునా ?
బల—దేవదేవా ! ఇంకఁగావలయు నదేమున్నది.
శంక—హలాయుధా ! భవత్కృతకృత్యంబులం దొక్కటిసైనన
కొఱఁత యున్నదా ?
కృష్ణు—అగ్రజా ! ద్వారకానగరంబున కఱుఁగ నుద్యుక్తులమగు
దము రండు.
బల—కృష్ణా అట్లేకావింతము.

(అందఱు నిష్క్రమింతురు.)

[ద్వారకానగరమున నొకవృత్తిమరు మొక్కుచు యెల్లిగాఁడు,
పుల్లిగాడు మరికొందరు ప్రవేశింతురు.]

యెల్లిగాడు & పుల్లిగాడు—అమ్మా! సత్తెంతల్లీ ! మాపెబులగు కిస్ట
మూత్తయ్య, బలిరామయ్యగార్లకు జయంగ్గాలమ్మ. నీకు
బత్తి పూజగాయిత్తామమ్మ. అమ్మోరా ! రచ్చించాలా
రచ్చించాల. (అని మొక్కుచుందురు)

[మల్లిగాడు ప్రవేశించి]

మల్లి—ఓరియెల్లిగో ! వత్తుండారు. వత్తుండార్రో !
యెల్లిగా—ఓరురా ! వారు ?

మల్లిగా—మనబలరామ కిట్టయ్యగార్లు అనిరుద్ధయ్యకు పెండ్లిచేసు
కోని అంపకొత్తుండారట, మనరోయిణమ్మ పెల్లివాకొత్తుండా
రని మనపూరంతా శృంగారింప సెప్పిందరో.

ఎల్లిగా—ఓరిమల్లిగో! నిసమేనారో?

మల్లి—ముత్తాలమ్మతోడురా.

ఎల్లిగాడు & పుల్లిగాడు—(అందరు ప్రీతిని మొగమగనిరి) ఏమిరా
మొన్నారా? నీతప్పునగాయయ్య నీకు మాకాడ గొర్రెపోతును
బలిత్తామమ్మోరా ఎల్లిగో ఓరిపుల్లిగో (అని కేకలువేయును)
యెల్లుదాంరారి. అందర్ని సూదాంరారి- (అందరు నిష్క్ర-
మింతురు.)

[ద్వారకాపురమందు; సభామందిరమున- బలరాముడు, కృష్ణుడు
మొదలగువారలు ప్రవేశింతురు.]

బల—మాధవా! దానవేంద్రునిచే మనకనన్యసామాన్య గౌరవంబు లభిం
చినది. ఇంకఁ గావలయున దేమున్నది.

శ్రీకృష్ణ—అయిన నిట్లగు గాక-

మ. ఫలసస్యంబులు చక్కఁగాఁ బెరుఁగ దృష్ణ్వర్షంబు గావించి భూ
తలమందెప్పుడు నగ్రపూతమయి మంత్రైశ్వర్యానందమిం
పలరన్ శాశ్వతధర్మమార్గరతులై యోగ్యుల్ సదాభక్తియు
క్తులచేతన్ దనరారుఁ గావుతను నీ తేజోధనుల్ కీర్తిమై.

గద్య. ఇది శ్రీసీతారామచంద్ర వరప్రసాదలబ్ధసరస కవితాధురంధర,
ఆసూరిమరింగంటి సజ్జనవంశ క్షీరపారావార రాకాసుధాకర రాఘ
వాచార్య ద్వితీయ పుత్ర మౌద్గల్యసగోత్ర గుణకదంబ లక్ష్మీ
సరస మాంబాగర్భ శుక్తిముక్తాఫల విబుధ జనవిధేయ
వేంకట నరసింహాచార్యకవి నామధేయ విరచితంబైన
అనిరుద్ధవిలాసంబను పంచమాంకము.

సమాప్తమ్.

---

# రాధాకృష్ణ

(గ్రంథకర్త:—పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు.)

ఇదియొక చక్కని భక్తిరసప్రధానమైన నాటకము. శ్రీకృష్ణునియందుగల యపారమైనభక్తి నిగూఢనిశ్చలమైనభక్తి రాధ యెన్నిరీతుల నేకవిధముగ బ్రదర్శించినదో యిందుగాంచనగును. రాధకును శ్రీకృష్ణునకునుగల ప్రేమ జీవాత్మకును పరమాత్మకునుగల యాధ్యాత్మిక సంబంధమువంటిది గాదని యీనాటకరాజము బోధించును. ప్రకృతి సుకుమారిణియై మహాసుందరియైన రాధ—సంతత శ్రీకృష్ణ సంకీర్తనామృతధారలనే యాహారపానీయములుగ గ్రోలిన రాధ—సర్వకాలసర్వావస్థలయందు లోకనాథు నిరంతరాయదర్శన నిత్యమహానందపరవశయైన రాధ—మృదుమధురమకరందపరిపూర్ణ వికసిత పుష్పతతులయందు—నిర్మల జలపూర్ణవాహినీతరంగములయందు—గిరినిర్ఝరములయందు-పర్వతమాలికలయందు—శ్యామలకోమలతరులతాగ్రములయందు—దిగంతములయందు—నందు—నిందు—నన నేల? ప్రకృతియందంతటను శ్రీకృష్ణునిమనోహరదివ్యరూపమును గాంచిన రాధ—తనయంతసుందరస్వరూపిణియగు కాంత యీభూలోకమున నెందునులేదని గర్వపడుచుండెడి సత్యభామను, కాలకూటానల ప్రతిమానవిషజ్వాలా భూయిష్ఠమగు కాళీయనాగేంద్రుని ఫణాగ్రమున దాండవమాడిన నటశిఖామణిని తన చీరచెఱగుకొంగున ముడివేసికొని లోబరచుకొంటినని విఱ్ఱవీగు సత్యభామను యేరీతిగ గర్వోపశాంతిజేసి, భక్తురాలుగ జేసినదో యీనాటకరాజమున, ముగ్ధాలోలుకు చక్కని పదములచే వర్ణింపబడినది. సత్యభామ అసూయాజనితగర్వరూపకములైన పల్కులు, చేష్టలు—శ్రీకృష్ణుని నిజస్వరూపము—శారదుని నిరంతర హాస్యప్రసంగములు చదివితీరవలయును. ఈనాటకమాంధ్రదేశమున పేరొందిన నాటకసంఘములచే ననేకపట్టణముల ననేకపర్యాయములు ప్రదర్శింపబడియెను. వెల 0—12—0

---

కురుకూరి సుబ్బారావు సరస్వతీబుక్ డిపో, బెజవాడ, కృష్ణాజిల్లా.